## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005719



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కస్తూరిమాత



[This book is commended for use in all the libraries of schools and public libraries in the state in RC No. 1048. M 4/58 dated 20-2-59 of the Director of Public Instruction, Andhra Pradesh, Hyderabad.]


కవిరత్న

విద్వాన్, వంగవోలు ఆదిశేషయ్య, బి. ఏ.,

(పండితులు, బోర్డు ఉన్నత పాఠశాల, యద్దనపూడి)





వీరభద్ర గ్రంథమాల

శ్రీ తత్వానంద శిల్పాశ్రమము

(వయా) మంగళగిరి, గుంటూరుజిల్లా.

సేకరణ

శ్రీమతి కందుకూరి కామాక్షమ్మ

ఖాదీ వర్కర్, శ్రీ తత్వానంద శిల్పాశ్రమం
ఆధ్యక్షురాలు, శ్రీ బాపూజీకాలనీ మహిళామండలి



ప్రతులు : 1000
ద్వితీయ ముద్రణము
*1959*
వెల. రూపాయిపావలా



సర్వోదయ ప్రెస్,
పటమటలంక.

# తొలిపలుకు

కస్తూరిమాత అను ఈ చిరుపొత్తమును యద్దనపూడి హైస్కూలు పండితులు శ్రీ విద్వాన్ వంగవోలు ఆది శేషయ్యగారు రచించిరి. శ్రీ తత్వానంద శిల్పాశ్రమము ఖాదీవర్కరు కందుకూరి కామాక్షమ్మగారు సేకరించిరి. వీరభద్ర గ్రంథమాల (శ్రీ తత్వానంద శిల్పాశ్రమము (వయా) మంగళగిరి) తరఫున ఇది ప్రకటితమయినది. ఇది 96 పుటల గ్రంథము. గాంధీజీ అర్ధాంగి కస్తూరిమాత జీవిత చరిత్రము ఇందులో కారాగారమున కాంతుని పార్శ్వమునం దుండి "ప్రాణేశ్వర పాదకమల నిక్షిప్త విమల హృదయ పద్మయై దివ్యసంవాసినీలోకమున కేగు" వరకూ వర్ణింపబడి నది. ఈమె చరిత్రము గాంధీజీ చరిత్రముతో ముప్పిరిగొనినది. కాబట్టి గాంధీ జీవితములోని ఘట్టములు ఇందులోనూ ప్రతి ఫలించుట బహుసహజము. ఈమెకు ఆదిలో చదువువాసనయే లేదు. హిందూ సాంప్రదాయము ఈమె వెంటబట్టియుండినది. కాని గాంధీజీకి అందరుగొప్పనాయకులకువలెనే నిరంకుశత్వము తప్పలేదు. కుటుంబమువారి వస్త్రధారణపద్ధతినిగూడ అతడు నిర్ణయించెనట! కాబట్టి జీవితములో ఎన్నెన్నిమార్పులు ఈయన తెచ్చెనో మనకు స్పష్టమే. ఇన్నిటికీ అనుగుణ్యముగా ప్రవ ర్తించి భర్త ననుసరించుటలో ఏడేండ్ల వయసునుంచీ ఎన్ని విధములయిన సమస్యలు కస్తూరీబాయిని ఎదుర్కొనెనో ఎవరు

దర్శకుఁడగు జాతిజనకుని యిల్లాలు నాదర్శమహిళయైనకస్తూరి మాత గాథామృత బిందు బృందము సేకరించి, తత్స్వరూప చిత్రణకై నిపుణుఁడగు శిల్పికై బహుదూర మాలోచింపక రసజ్ఞతావిభూషణుఁడగు తన యగ్రజ ముఖమున నన్ను బ్రేరే చినది. శారదాంఘ్రి సరోరూహ ద్వంద్వసమర్చన కిది యనూహ్యము హఠాత్సంభవము నగు నవకాశము గదా యని తగిన విరామము లేకున్నను రచనకుఁబూని భగవదనుగ్రహ విశేష మున నా యుడుతభక్తిని జూపింపఁ గలిగితిని. సహృదయ లోకము మానసౌకస్సమూహముగదా!

మాతృశ్రీ మధురజీవిత గ్రథనమునకుఁ బ్రోత్సహించిన శిల్పాశ్రమ సంస్థకుఁ జిరాయురారోగ్యానన్యత్వములు భగవానుఁడనుగ్రహించుఁగాత.

ఈ చిఱుకబ్బమును నున్నత పాఠశాలలును, కళాశాలలును ఉపవాచకముగ గ్రహించి రచనోద్యమమును బ్రోత్సహింతురుగాత.

ఇట్లు
గ్రంథకర్త

# వి ష య సూ చి క

# 1. చిరవాంఛాఫలసిద్ధిరస్తు

చిఱునవ్వు దొంతరలతో, సరస సల్లాప సంరంభముతో, పేరటాండ్ర పెండ్లి ముచ్చటలతో, పురోహితజన వైదికాశీర్వాదములతో, చిరవాంఛా ఫల సిద్ధిరస్తు మొదలగు శుభాశీర్వాద సమ్మోదములతో బాజా భజంత్రీలతో సాగి పోవుచున్నది ప్రదానోత్సవము ముక్కుపచ్చలాఱని ముద్దు బిడ్డలకు ఏడేండ్లకుఁ బైఁబడని కస్తూరీ మోహనులకు. నిన్న గాక మొన్న కన్నుదెఱచిన యీ పిన్నవాండ్రకీ సంరంభము నందలి యంతరార్థ మెఱుకపడియుండదు. ఈ యుత్సవ సంరంభమున వారితోఁ బనియునుండదు. కన్యావరుల తలి దండ్రులు గావించుకొను నట్టి యొడంబడికయే యిది. అయి నను, నిది యాడంబరముగ జరుగుటకు హేతువు దీనికిఁ గర్త లైన పోరుబందరు దివానగు కాబా గాంధియును, వణిక్ప్రముఖుఁడగు గోకులదాసు మకంజీయును సుప్రసిద్ధ వైశ్యవంశ శుక్తి ముక్తాఫలములగుటయేగాక యైశ్వర్యవంతులు ననితర సామాన్య సౌహార్ద విభవాభిరాములు నగుటయే. ఆ బాల్య ప్రవర్ధమాన స్నేహవల్లరి కల్లువెట్టవలయునను వారి యాత్సు క్యమే యమూల్య కాలహరణమున కియ్యకొనక కనిష్ఠధర్మ ముగ నీవిధమగు కార్యారంభమునకు దారితీసినది. శుభ మగుగాక!

కడచిన వాఁడేండ్లు. క్రమ కస్తూరి పరిమళము లెగఁ జిమ్ముచు నవ్రమగాత్ర లతికతో కమనీయ కాంతి విభవముతోఁ గనుల పండువు సేయుచున్నది పదియు మూఁడేండ్లు నిండియు నిండని ప్రవిమల కన్యావతంసము కస్తూరిబాయి. తుల్య వయః

ప్రాదుర్భావమునఁ దుహినాంశు నంశమున మహికిడిగ్గిన మహ
నీయ మూర్తియనఁ బరమ సాధుసద్గుణ వికాసభాసుఁడు
మోహనదాసుఁడు వివాహోత్సవమున కువ్విళ్ళూఱుచు
న్నాఁడు. గృహస్థాశ్రమస్వీకార పరమార్థ మెఱిఁగికాదీ
యుబలాటము. మంగళతూర్యములు, వివిధోత్సవములు,
విందులు, వినోదములు, ఊరేగింపులు, మీఁదుమిక్కిలి
యాటపాటలకనువైన యందాలబాల. ఇవి యతనియూహాలు.
కస్తూరిబా యూహా లనూహ్యములు. ఆధారములు లేవు.
కాని జననీ జనకుల యాజ్ఞల కనువుగ సంసారభారమును
వహించు నుదారములగు తలంపులుండకపోవు.

నవ వధూవరుల వయస్సుల తారతమ్యముగూర్చి
యభిప్రాయభేదములు నాఁటికి నేఁటికిఁ గలవు. వరునికంటే
వధువె వయోధికయని యొకపక్షమువారి వాదము. కాదని
యొండొక పక్షము. ఇరువు రొకేవత్సరమున నొకేగ్రామమున
జన్మించిరనుట యిరువాగులవారికి సమ్మతమగు సిద్ధాంతము.

# 2. బాలదంపతులు

బాల దంపతుల వాలక మొకింత వింతచెలువమున కాలవాల మైనది. ఆజన్మ జిజ్ఞాసువు, అత్యంత సత్యనిష్ఠాగరిష్ఠుఁడు, నిష్కళంక పావనశీలుఁడునగు మోహనదాసుని నవజీవనవల్లరి పుష్ప పరిశోభితమై యలరు నదనున, స్వల్ప మూల్యమునకు లభ్యములగు కొన్ని ధర్మబోధక పత్రికలు వెలువడుచుండెను. వానిని శ్రద్ధాళువై పఠించి యందలి ప్రతి సూక్ష్మాంశమును సునిశిత దృక్కులతో వీక్షించి యాచరణమున సాక్షాత్కరింపఁజేసికొన నుత్సుకుఁడైన బాలబాపునకు హైందవాదర్శము లందవశ్యము పరిగ్రహణీయమై ఏక పత్నీవ్రతము గోచరించినది. తన్నిష్ఠాపరుల మహనీయతత్త్వము సుబోధమైనది. భార్యా భర్తృ సంబంధమునందలి పవిత్రత తెల్లమైనది. జానకీ రామ భద్రులు, సావిత్రీ సత్యవంతులు, చంద్రమతీ హరిశ్చంద్రులు మున్నగు పుణ్యదంపతుల గణ్యచరిత్రము లతనికి స్తుతిపాత్రము లైనవి. వారి యడుగుజాడలలో నడయాడుటయే కర్తవ్యమని నిర్ధారితమైనది. తాను పరస్త్రీ వైముఖ్యము నారాధింపవలె; తన ధర్మపత్ని పరపురుష ముఖావలోకనము సేయకుండవలె; అంతియకాదు తన్నధినాథునిగ నెల్లయెడల భావించి యారాధింపవలె; తనయాన జవదాటకుండవలె; ఇంతేల తన ముదల లేనిది కదలనైనఁ దగదు. సర్వాత్మ సమర్పణము గావించి యుండవలె. ఈ విధమగు మహితాదర్శములఁ బాటించుటకుఁ దగిన విజ్ఞాన మామెకుఁ బ్రసాదింపవలె. ఇట్లు నిశ్చయించుకొన్న సచ్చరిత్రునకు సాధ్వీమతల్లియైన సతీవతంస మర్ధాంగలక్ష్మి యగుట యదృ

ష్టము. ఉడుకుటకుముందు గుడగుడవలె నీయదృష్ట పరిణామ మునకుముందు కొన్ని యొడిదుడుకులు పొడమకపోలేదు.

మోహనునకు విద్యాప్రయోజనము స్వానుభవమునఁ దెలియవచ్చినది. సద్గ్రంథపఠనము సచ్ఛీలమునకుమూలము, నాలవాలమునని యెఱుక పొడమినది. సద్గ్రంథపఠనాభిలాష యోషారత్నమునకుఁ గలిగింప యత్నము గావింపఁబూనెను. అది ఫలింపలేదు. కేలందక్క నాబాలను జేర వీలొదవదు. పగటిపూట నామె జాడయేని నీడయేని జూడ సాహసింపఁడు. కారణమేమన, పెద్దలయెదుటఁ బత్నిని సమీపించుట కగ్గల మైన సిగ్గావహించుటయే. సద్దుమణిగినపిమ్మట నద్దమరేయి నిద్దంపు ముద్దుగుమ్మను జేరుచో గ్రుడ్డి వలపు పైకొని గురు తరాదర్శమును గూల్చఁదోయును. చదివింపవలయునను తన సంకల్పమునకుఁ దోడు చదువవలయునను నాకాంక్ష యామె కుండిన నెట్లుండెడిదో. పావనశీలమునకు పఠనప్రయాసము లకుఁ బొత్తులేదనియో, సదాచార సంపన్న గృహిణుల కీవిద్య యపూర్వమనియో, అక్షరశిక్షకు ప్రాయము మీఱెననియో, వరుఁడు గురుఁడైనచో బిడియమువీడి యెడముగఁ గూరు చుండి పుస్తకపాణియై వాణీ చరణదాస్యమున కియ్యకొనుట యెట్లనియో, కస్తూరిబాయికి విద్యావైముఖ్యము ప్రాము ఖ్యము వహించినది. తానుగాక ఇతరులు గురులైనచో విద్యా బోధనము సాధ్యమగునేమో యనియుఁ జూచినాఁడు మహా త్ముఁడు. మూఢాచారములలో నగ్రేసరమై నాఁటికి నేఁటికి నొకింత మార్పులేక ముఖ్యమై కథియవాడు సంస్థానమున వరలుచున్న ఘోషాపద్ధతి దీనికొక యడ్డయినది.

ఇట్టి యడ్డంకు లెన్నియున్నను గాంధిజీ ప్రయత్నము పూర్తిగ నిష్ఫలమనరాదు. కస్తూరిబాయి మాతృభాషయం దొకింత చదువనేర్చినది. విషయాభిలాషకు లోనుగాక వివేకముతో విద్యాశిక్షణకుఁ బూనినయెడల విదుషీమణియై యుండెడిదని యమ్మహాశయుని యాత్మవిశ్వాసము. నిర్మలప్రేమ కసాధ్య మొకటిలేదని యాతఁడు నుడువును.

ఇఁక నీ దంపతులకు దేహదార్ఢ్య ధైర్య స్థైర్య విద్యా వివేకములందుమాత్రమె కాక చిత్త వృత్తులందుఁ దారతమ్యము సంభవించినది. గాంధీజీయొనర్చిన కట్టడుల యట్టడుగున నిట్టలమైన యాదర్శ మామెకు గోచరింపలేదు. వీని యొత్తిడి హెచ్చుకొలది ఆమె స్వేచ్ఛ యధికమైనది. ఆమె స్వాతంత్రముగ సంచరించునను ననుమానము పెనుభూతమై మహాత్ముని కలప నారంభించినది. అగ్నికాజ్యమువోలె మహాత్మునికిఁ గల యొక మిత్రుని దురుపదేశము దీనిని బెంపఁదొడగినది. ఇంతకు నామెప్రవర్తనము దూష్యమనుటకుఁ దగిన యాదరువు లేశమైన లేదు. కోవెలల కేఁగుట, చెలిమికత్తెలతోఁ జెలగి యాటపాటలలోఁ బాల్గొనుటతప్ప ఆమెస్వాతంత్ర్యమునకు నిదర్శనములు లేవు. ఇట్టి పనులకుఁగూడ తన యనుమతి వలయునన్న నే బాలిక యంగీకరింపఁగలదు ? స్వల్పవిషయములందిట్లు నిర్బంధము లావశ్యకములని భర్త తలంచుచో భార్యమాత్ర మేల భర్తను నిర్బంధింపరాదు ? పరస్పరనిర్బంధములకు లోనై వారు సాధించున దేమిగలదు ? ఈ భావములు సత్యప్రయోగ దీక్షాదక్షుఁడైన మహాత్మునివి. అతఁడే బాల్యమున లౌల్యమునఁ జిక్కినపుడు స్త్రీ భర్తృ పరతంత్ర

యనియు భోగ్యవస్తువనియుఁ దలంచెను. సహధర్మచారిణి యనియు, జీవిత భాగస్వామిని యనియు నతఁ డప్పుడు గ్రహింపనేరఁడయ్యెను.

పదమూఁడేండ్ల పసప్రాయమున సంసార సాగరమున మున్కలిడఁ దొడఁగిన యీ నవవధూవరులకు నడుమ నడుమ వియోగ వ్యథావళులు జననీ జనకులు కల్పింపకున్నచో వారి జీవితములు దుర్భర దుస్సహ వేదనా నిలయములై యుండెడి వని కర్మచంద్రుని నిర్మలవచస్సు. బాల్యవివాహమువలన కలుఁగు చెడుగులఁబోద్రోల పెద్దలీ సదాచారము నవలంబించి రని యతనినమ్మకము. పదమూఁడు పదునెన్మిది యేండ్లకు నడుమ నైదేండ్లలో మూఁడేండ్లు మాత్రమే మొత్తముపై సతీపతులు గలిసియుండినది. ఒకింతకాలము కుతుకము మీఱ వలపు తలపులు సంతరించునంతలోనే తదనుభూతికి దూరము కల్పింపనో యనునట్లు కస్తూరిబాయిని పుట్టింటివారు పిలువ నంపుదురు. ఈ వియోగజలధి నీదుకెట్లని కస్తూరిమాత పరి తపించెనో లేదో యూహింప నెఱవులేదు. గాంధిజీమాత్రము కళవళపడెననుట కాతని యాత్మకథయే యఖండ సాక్ష్యము.

ధర్మపత్నియని తలంపక దారుణ హింసలకుఁబాల్సేయు బాలిశులలో నగ్రేసరుఁడై కస్తూరిబాయి కనేక కష్టములు కలిగించెను. ఒకప్పుడు పుట్టినింటికంపి యామెను నానావస్థల బాల్సేసి పిమ్మట పరిగ్రహించెను. హైందవ కుటుంబములం దలి యిల్లాండ్రస్థితి శోచనీయముగదా! నిర్హేతుకముగ నను మానితయై నవమానితయైన స్త్రీ మగనివిషయమున నెట్టి సాహసమున కొడిగట్టజాలదు. 'క్షమ యా ధరిత్రీ' యనఁ

దగిన యామె భర్తృ చరణారవింద సేవనమే జీవనమనియు, యుపాసన ధర్మమనియుఁదలంచును. పాద సేవయుఁ గలుగనిచో సందర్శనమునేని అభిలషించును. అదియు నొదవనిచో నతని నామస్మరణమునేని గావించుచు జీవించును. అందులకు నవకాశము నిష్ప్రచ్ఛరమగుచో ఆత్మార్పణము గావించును గాని యొండు వెలవు వెదకదు. ఒకవేళ కరుణాళువై ప్రభుత్వము స్త్రీలకు భర్తలపై నభియోగము తెచ్చి శిక్షించు నధికార మొసగినను పాతివ్రత్యమునకుఁ బేర్వడిసిన యున్నత కుటుంబినులీయవకాశమును గ్రహింపనొల్లరు. అనుమానింపఁబడిన బంటు ప్రభుని, తనయుడు జనకుని, మిత్రుడు మిత్రుని విడచుటకు వీలుగలదుగాని భార్య భర్తను విడనాడవీలులేదు. యావజ్జీవిత మతని కైంకర్యమున నిమగ్నమైయుండకతప్పదు.

పవిత్ర గార్హస్థ్య ధర్మ నిర్వహణమునకుఁ బట్టుకొమ్మ చేఁబట్టిన కొమ్మ. సత్సంతానప్రాప్తి వివాహమునకు ఫలము. 'అపుత్రస్య గతిర్నాస్తి' యను ధర్మము ప్రాచీనము. సుతోదయమున కువ్విళులూరని సతియుండదు. కస్తూరిబా గాంధీ వధూవరులీ యభ్యుదయము హృదయపూర్వకముగ నభిలషించిరో లేదో కాని 1888 లో వారికి ప్రథమ పుత్రోదయమైనది.

నాటికి వారివయస్సు పదునెన్మిది యుండును. 1887 నాఁటికి మోహనదాసుడు ప్రవేశ (మెట్రిక్యులేషను) పరీక్షయందు కృతకృత్యుఁడు. ఉన్నత విద్యా వ్యాసక్త చిత్తుడై యతఁడు సాగరముఁ దరించి యాంగ్ల వసుంధర కేఁగ నుద్యుక్తుఁడై వివిధ సాంఘిక దౌర్జన్యములకు నార్థిక నిస్సహాయతకు

లోనైయున్న యదనున బిడ్డతల్లియైన యన్నమిన్న యత్త వారింట భర్తృ సందర్శనోత్సుకయై నిత్యము పరితపించుచు నెన్ని మేఘసందేశము లూహించియుండెనో తెలుపఁజాలము గాని యామె యతని పురోగతి కభ్యంతరముగాక యామోదమునందుట గ్రహింపఁదగియుండెను. వనవాసమున కేఁగిన లక్ష్మణుని నిరీక్షించుచు మూగనోముపట్టిన పడతి యూర్మిళయా యీామె ?

వయస్సునందు మిన్నయైనను విజ్ఞాన సముపార్జనావకాశములు వడయని కస్తూరిబాయి భర్తృ చరణసేవాసక్తయగుటయేగాక కామ తృష్ణాలతకుఁ బ్రోదిసేయుటయందు భర్తకుఁ దోడ్పడక తప్పినదికాదు. తన జనకుడు తీవ్రామయ పీడితుఁడైయుండ, నొకవైపు శ్రవణుని గురుత్వము నాశించి గురు చరణసేవ సేయుచు, హృదయముమాత్రము చక్షురుత్సవదాయినియగు హృదయేశ్వరి కాయముపైనుంచి పాన్పుజేర నదనెప్పుడాయని పలవరించు వరునికై నిరీక్షింపక తప్పునాయే యొప్పుల కుప్పకైనను ? నిరీక్షించి నిరీక్షించి పితృసేవయందున్న పతిని పతితుని జేయనోల్లక నిద్రాపరవశయైయున్న నీరజాక్షిని నిర్నిద్రకుతూహలియైన నిజేశుఁడు దరిజేరి మేలుకొల్పి ప్రణయసామ్రాజ్య పరిపాలనమున కియ్యకొల్పి మదనదేవ పరిచర్యా పర్యుత్సుకుఁడై యున్నయదనున నతనికి మహావమాన మనఁగఁ బరిణమించిన పితృ నిర్యాణవార్త హృదయ విదారకముగఁ జెవి సోకెను. ఇందుల కతఁడే బాధ్యుఁడుగాని యన్నెము పున్నెము నెఱుఁగని యన్నులమిన్న

కాదనఁదగును. అందుచేతనే యతఁడామె నిసుమంతయేని తూలనాడి యెఱుఁగడు.

మహాత్ముఁ డింగ్లాండులో నున్నయెడ మద్య మాంస మహిళలను పరిత్యజించి మాతృదేవి కొనర్చిన వాగ్దానమును నిలబెట్టుకొనుటకును భార్యాపుత్రుల సంస్మరణము గూడ తోడ్పడియుండును. అచట బారిష్టరు పట్టభద్రుఁడై స్వదేశ మునకు 1891 లోఁ దిరిగివచ్చెను. మొదట రాజకోటలోను పిదప బొంబాయియందును నొక సంవత్సరకాలము న్యాయ వాదవృత్తి నవలంబించియుండెను. అందతనికి పరాజయమే ప్రాప్తించెను. సత్యదేవి నారాధించుచు మితభాషియగు నాత నికిని కల్లబొల్లి కబుర్లతోఁ దిమ్మిని బమ్మిని బమ్మిని తిమ్మిని జేయు న్యాయవాదవృత్తికిని బొత్తు కుదురునా? ఏదోవిధ మునఁ బొట్టబోసికొనుచు నుండునెడ, కస్తూరియు కాంతుని కష్టసుఖములలోఁ బాల్గొనుచుండెను గాని గాంధీగారింకను ఆమె హృదయము నెఱుగక యామెను నిరుపమాన కష్టపరం పరకు లోనుచేయుచుండెను. ఎన్నడా మహనీయునకు నిజ స్వరూప మెఱుకపడునో! ఆమె కష్టములు గట్టెక్కునో!

# 3. దక్షిణాఫ్రికా పిలుపు

మోహనదాసుఁ డిపుడు బారిష్టరు పట్టభద్రుఁడు. పరీక్షా కాలమే తెంచినది తనశక్తి సామర్థ్యములు వెల్లడించి జీవిత సంగ్రామమునఁ బైఁజేయి యగుటకు. ఫిరోజిషా, బహరుద్దీనులవంటి యమోఘ వక్తలు ప్రత్యర్థులగుండెల నీరు సేయుచు వాదించుటఁ దలపోసి తన యశక్తికిఁ గడుంగడు వగచి తుదకు అనుభవజ్ఞుల హితోపదేశము లాలించి ధైర్యము వహించి వృత్తిలోఁ బ్రవేశించెను. తొలుత రాజకోటలో నారంభించెను. పిమ్మట బొంబాయినగరమున కేఁగెను. రెండుతావుల నతనికి బరాజయమే. సత్యము నారాధించువాడును, మితముగ భాషించువాఁడును నగు వానికి నేతిబీరకాయఁబోలిన న్యాయవాదవృత్తియందేల విజయము ప్రాప్తించును? అదియుఁగాక భగవదిచ్ఛ వేరుగనుండ నిట్లేల జరుగును!

వృత్తియందు రాణింపక చిత్తవృత్తియందు సత్తుచిత్తుల విడువకుండిన యీ మహనీయమూర్తికిఁ గీర్తికి మూలమైన యొక సన్నివేశము భగవత్కల్పితమే మోయనఁ జేకూరినది. ఇంటగెలిచికదా రచ్చగెలువవలయును? స్వదేశమున న్యాయవాదవృత్తియందు నిరర్థకుఁడై, నిస్పృహాయత్తచిత్తుఁడై దారిగానక దైవము దరిజేరిన యితనికి దక్షిణాఫ్రికాలోని యొక మహమ్మదీయ వాణిజ్యసంస్థకు సంబంధించిన వ్యాజ్యమున వాదించుటకుఁ బిలుపువచ్చుటయా? ఆపిలుపందికొని యచటికేఁగి యందుఁ గృతార్థుఁడగుటయేగాక యందలి రాజకీయములం దవమానములకు గుఱియగుచున్న భారతీయుల పారతంత్ర్య నిర్మూలనమున కుద్యమించి విజయుండగుటయా?

అజ్ఞాతవాసాంతర విజయునింబోలి యమేయ మహత్త్వమును వెల్లివిరియించుచు స్వదేశమున జాతీయోద్యమమునకు నూతన చైతన్య మొదవించుటయా! అల్పసత్త్వుఁడును, అసమగ్ర సాహితీ సంపన్నుఁడును నగు నొక సామాన్య వ్యక్తి యిట్లు లోకాలోక విభ్రమము గలిగించుటయన నమోఘ దైవ సంకల్పమనియే విశ్వసింపఁదగును.

మహమ్మదీయ వణిక్ప్రముఖ్యుని యాహ్వానము నంది దక్షిణాఫ్రికా కేఁగిన గాంధి జాతినైమనస్యమున కెరయై యందుఁబొందిన యవమానములకు మేరయే లేదు. అయ్యవమానములనెల్ల సహించి యందున్న భారతీయ కార్మిక కర్షక జనుల కష్టనిష్ఠురముల నెఱింగి తన్నివారణోపాయముగ సత్యాగ్రహోద్యమమునకు జనకుఁడయ్యెను. మూఁడేండ్లు నొంటరిగనే కాలక్షేపము గావించెను. పిమ్మట భారతదేశమున కేఁగి దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితిఁగూర్చి తీవ్రాందోళనము సలిపెను. మరల దక్షిణాఫ్రికా కేగునపుడు భార్యాపుత్రుల వెంటనిడుకొనిపోయెను.

డర్బనునగరమున నోడదగిన గాంధీని శ్వేత జాతు లాబాల వృద్ధ మెదిరించి యతనిపై శిలావృష్టి గురిపించెను. పోలీసు సబిన్స్పెక్టరు భార్యవచ్చి యతనిని గాపాడకున్నచో నతఁడు కథావశిష్టుఁడియ్యేడివాఁడే. కస్తూరిబాయి మాంగల్యమే యతని కీరూపమునఁ దోడ్పడెనో, భారతీయుల తపఃఫలమే యతని యుసురుల నిలఁబెట్టెనో, ఇంతేల? దైవమే యవతార ప్రయోజనము సాధింప నతని రక్షించెనో.

లోకమన నెట్టిదియో, రాజకీయ వాతావరణమన నెట్టిదియో, ప్రజా పారతంత్ర్య నిర్మూలనోద్యమములన నెట్టివియో యెఱుగని సామాన్య గృహిణియగు కస్తూరిబా కడ గండ్లకీఁక మేరయేలేదు. ఏనాడు ఫ్రిస్టైగట్టెనో యానాఁడే తన ప్రాణేశుఁడు ప్రత్యక్ష పరమేశుఁడనియు, నతనికి జీవిత సర్వస్వ మంకితమయ్యెననియు, నతనికి సర్వవిషయములందు సహధర్మచారిణియై యుండవలయునను భారతీయ సతీధర్మము నవలంబింప నుద్యుక్తయయినది. విదేశమునఁ బలుగాము లందనే తెంచుటయన నెంతటిసాహసము, ధర్మదీక్షయు నుండ వలయును సాధారణ హైందవకుటుంబినికి ?

అదిమొదలు తొమ్మిదిసంవత్సరములు గృహస్థ జీవితము భర్తృపరిచర్య గావించుచు నవిచ్ఛిన్నముగఁ గడపినది. ఈకాలముననే గాంధీజీ ట్రాన్సువాలు సుప్రీమ్ కోర్టునకు అటార్నీయగుట, ట్రాన్సువాలు బ్రిటీషు ఇండియన్ అసోసియేషనును నెలకొల్పుట, ఇండియన్ ఒపీనియన్ అను వారపత్రికను ప్రచురించుట, తానూహాకాశమున నిర్మించుకొన్న శాంతిసామరస్యముల కాలవాలమైన రాజ్యమునకుఁ బ్రతిరూపమైన ఫోనిక్సు సెటిల్మెంటును స్థాపించుట యను ముఖ్యాంశములు జరిగెను. ప్రసిద్ధములైన సత్యప్రయోగములు ప్రారబ్ధము లిచ్చటనే; వీనినన్నింట సహధర్మచారిణియైన యర్ధాంగి యతనికి సంపూర్ణ సహకారిణి యగుటయే గాక యొరుల తప్పులకంటెఁ దనతప్పుల నెన్నఁడును సైరింపని యతని మన స్తత్త్వానుగుణముగ నీప్రయోగముల వలనఁ గలుగు విషమపరిణామములకు బలియగుచుండెను.

గాంధీజీ హృదయమును తొలుత నొకింత స్వాతిశయా భిమానము లాక్రమించెను. అతడు తన నూతన పరిసరమున కనుగుణముగఁ దన కుటుంబపద్ధతులకు వింత తీరుతియ్యములు గల్పింప నూహించెను. అతఁడు తన కుటుంబమువారి కుండ వలసిన వస్త్రధారణ విధానమును విధింపదొడగెను. తమ్మిమ్మ తరులు కథియవాడలోని వర్తకులని తేలికగఁ జూచుట యత నికి సహింపరాకుండెను. పార్శీలు నాఁటి భారతీయజాతులలో నొకింత నాజూకైనవారు. యూరోపియను విధానము తన కంతగా నచ్చకపోవుటచేతను, వర్తకులని యనిపించుకొనుట అనిష్టమగుటచేతను, పార్శీలు నాగరిక భారతీయులగుట చేతను, వస్త్రధారణమున పార్శీ యనుకరణమున కియ్య కొనెను మన గాంధీకుటుంబము. అందుచే కస్తూరిమాత పార్శీ చీరెను, పిల్లలు పార్శీ చొక్కా లాగులను ధరించిరి. ఇక వీరెల్లఱు మేజోళ్ళను బూటులను ధరింపవలసివచ్చెను. చాలకాలము కస్తూరిబాయికి బూటులు ధరించుటకుదుర లేదు. బూటులవలన కాళ్ళకు తిమ్మిరులు, మేజోళ్ళు స్వేదమును కలిగించి బాధించెను. ఈ బాధ లన్నింటిని సహింపక తప్పి నదికాదు. వీనికిఁదోడు ఫోర్కులు స్పూనులు ఆహార స్వీక రణమున నుపయోగింపఁబడినవి. ఈ పాశ్చాత్య నాగరికతా వ్యామోహము కాలక్రమమున గాంధీగారికిఁ దొలఁగిపోయి నది. అంతట ఫోర్కులు స్పూనులు వానియంతటనవే యంత రించినవి.

## 4. గృహమున సత్యాగ్రహము

డర్బనులో నుండగా గాంధీగారి గుమాస్తాలుగూడ నప్పు డప్పుడు అతని గృహముననే వసించుచుండిరి. వారిలో హైందవులతోఁబాటు క్రైస్తవులుగూడఁ గలరు. వారి నెన్నఁడును తన యాప్తులకు భిన్నులుగ వ్యవహరించి యెఱుఁగఁడు గాంధీజీ. వారుగూడ తనకుటుంబములోనివారనియే యత్యం తాదరమున మన్నించుచుండెను. ఇది సరిపడలేదు కస్తూరి మాతకు ప్రారంభదినములలో. ఈక్రైస్తవులలో నొకడు పంచమజాతికిఁ జెందినవాఁడు. కస్తూరిబా సంస్కరణోద్యమ తత్త్వముగాని తదావశ్యకతగాని యెఱుఁగదు. ఆమె సదా చార పరాయణమైన కుటుంబమునకుఁ జెందినది. సవర్ణులచేత నవర్ణు లనఁబడు పంచముల నెవ్విధమున నేడ్పించునదియు నెఱుఁగును. అది వంశమర్యాద యనియే యామె పితరుల వలన గ్రహించినది. పూర్వాచారములందు పట్టుదలగల యామెకు బాపూజీ యవలంబించు సంస్కరణములు విడ్డూర ముగ గన్పించినవి. తనకు శక్తిగలయంతవట్టు సడలని పట్టు దలతో నతనితోఁదన సంప్రదాయముల నిలబెట్టుకొనుటకుఁ బోరాడినది. గాంధీజీ పట్టుదలవిషయమున భగీరథుఁడే. అతఁడు నమ్మిన సంస్కరణమును కార్యాచరణమునఁ జూడ నిది కనుమూయఁడు. ఈ సంఘర్షణము తీవ్రమై యొకప్పుడీ పవిత్రదంపతులకు - వైమనస్యహేతువైనది. అయినను కస్తూరిబా మహనీయుఁడగు నమ్మహాత్ముని యాశయ సాఫల్యా మునకుఁ దోడ్పడినది.

డర్బనులోని వారిగృహము పాశ్చాత్య విధానమున నిర్మితమైనది. మురికినీరు బయటికిఁబోవుటకు వసతులులేవు. ప్రతి గదియందును కుండలుంపఁబడెను. ఎవనిపాత్రను వాఁడే పరిశుభ్రము చేయు టందలి నియమము. ఒకప్పుడొక పంచముఁడు నూతనముగ వారిగృహమునకు వచ్చెను. అతఁడు గృహనియమములకు నూతనుఁడగుటచే నతని పాత్రనుగూడఁ బరిశుద్ధ మొనర్చుపని వీరిది యయ్యెను. గాంధీజీ యాపనికిఁ బూనెను. అందులకుఁ గస్తూరి యంగీకరింపలేదు. స్వయముగఁ దానే యా నికృష్టకార్యమునకుఁ బూనుట కామెమనమొగ్గలేదు. భర్తృ నిర్బంధమునకు లోనై యాపాత్రను పై యంతస్తునుండి నిచ్చెనమీఁదుగఁ దెచ్చుచున్న యామూర్తి మహాత్ముని కెన్నఁడును మఱపు రాదు. చెక్కుటద్దములపై జాలువారుచున్నవి యాఁశిముత్తెములఁబోలు కన్నీటి తుంపురలు. మహాత్ముఁ డెట్టి యల్పకార్యమునేని స్వధర్మమని సంతోషముగఁ జేయునేగాని నిర్బంధమునకు లోనై దుఃఖముతోఁ జేయఁడు. గృహపారిశుద్ధ్యము విషయమునగాని మఱేవిషయమునఁగాని యసహ్యాకరమైన పనియనునది యతని దృష్టిలోలేదు. కన్నీరుగార్చుచున్న కస్తూరి వాలకముజూఁచి యుగ్రుఁడైనాఁడు. కనుల నిప్పుకలురాల 'ఇట్టిసేత నాగృహమునఁ జెల్ల' దన్నాఁడు. ఆమెయు, "నట్లయినచో, మీ గృహమును మీరే యుంచుకొనుఁడు. నన్ను బోనిండు" అన్నది యత్యంతాగ్రహముతో. వెంటనే యామెను చేయిఁబట్టుకొని బటబట లాగికొనిపోయి, యానిచ్చెన కెదురుగనున్న ద్వారము కడకుఁబోయి తలుపు దెఱువఁబోయినాడు. అప్పుడామె

యిట్లన్నది, "సిగ్గేమాత్రములేదా? ఇప్పుడు నన్ను బయటికంపినచో నెవరికడ కేఁగఁగలను? తల్లియా? తండ్రియా? ఎవరు నన్నాదరింతురు? మనమిట్లు కీచులాడుకొనుచున్న యెడల నెవరేని జూచిన నవ్వరా? ఈ మాత్రము మీకుఁ దెలియకపోవుట శోచనీయము. దయయుంచి తలుపు వేయుడు."

ఇట్లు పలికిన యామె కెట్టి సమాధానమును జెప్పక మౌనముద్ర వహించి తన దురుద్యమమును విరమించుకొన్నాడు గాంధీజీ. ధీరత్వము నటించినాఁడేగాని తన తప్పిదమునకు సిగ్గున క్రుంగిపోయినాడు. తన్నామె వీడజాలకున్నచోఁ దానును నామెను విడువఁజాలఁడుగదా!

ఇట్టి వెన్నో భార్యాభర్తల నడుమ అడుగడుగునకు జరుగు పోరాటములు. వీని నన్నింట తన యోరిమి కూరిమి ప్రదర్శించి యతని నొకదారికిఁ దెచ్చెడిది. ఓర్పులేమికి మహాత్ముఁడే సిగ్గిలువాఁడు తుదకు.

# 5. ధైర్యము

"ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందుఁ దాల్మియున్"

ఇత్యాదిగ భర్తృహరి పేర్కొన్న గుణములు సజ్జనులకు స్వభావసిద్ధముగదా! సౌజన్య సౌశీల్యముల కిక్కయగు సతీ వతంసము ధైర్యగుణవిరాజితయై వరలిన ఘట్టములు పెక్కులు. ఆపదలు వొందుతఱిని మహామహీధరాశ్మ సంఘాత కర్కశమై తనర్చు హృదయ ముండుటయు అక్కజము గాదు.

కస్తూరిబాయి కనేక పర్యాయములు మృత్యుసన్నిభమగు తీవ్రవ్యాధిబాధ సంభవించెను. ఇట్టి వ్యాధులకుఁగూడ గృహవైద్యమే శరణ్య మయ్యెడిది. అయినను ధైర్యవతి యగుటచే పతికార్యక్రమమునకు భంగకారిణిగాక యోర్పుతో నట్టి గండములఁ గడచెను. ఇట్టి సందర్భములు ఆమె జీవితమున ముమ్మారు సంభవించెను. వీనిని మహాత్ముఁడు తన యాత్మకథయందిట్లు వర్ణించెను.

"ఆమెకు రక్తస్రావమను వ్యాధి మొదటిసారి సంభవించునప్పటికి దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమము ప్రారంభింపఁబడి తీవ్రముగ సాఁగుచున్నది. వైద్యమెఱిఁగిన యొక మిత్రుఁ డీమెకు శస్త్రచికిత్స యవసరమని నుడివెను. తొలుత నామె యించుక సందియంపడి పిమ్మట నందుల కంగీకరించినది. ఆమె శరీరము పూర్తిగ కృశించి యున్నది. మత్తుమందుపయోగింపకయే శస్త్రచికిత్స చేయవలయును. ఈ చికిత్స విజయవంతముగ నిర్వహింపఁబడుటకుఁ గారణమామె యకుంఠిత ధైర్యమే. ఈసంఘటనము డర్బనులోనిది. ఆడాక్టరు నాకు జోహాన్సుబర్గున కేఁగ సెలవిచ్చెను. అతఁడును అతని

భార్యయుఁ గస్తూరిబాయి విషయమున నెట్టివిచారము మీకు వలదని నాకు ధైర్యము చెప్పిరి.

కొలఁది దినములలో నామెకు వ్యాధి ప్రకోపించినది. ఒకపర్యాయ మామెకు స్మృతికూడఁ దప్పెను. నాయనుమతి లేనిది ఆమెకు మద్య మాంసము లౌషధములుగ నైన నొసగఁ రాదని యాడాక్టరునకుఁ దెలియును. అందుచే నతఁడు మాంస రసమామెకు తేనీటితోఁ గలిపి యిచ్చుట కనుమతింపఁగోరుచు జోహానిస్బర్గునకు నాకుఁ దంతియిచ్చెను. అందులకు సమ్మ తింపననియు నామెకు స్మృతి కలిగినపుడడిగి యామెకు సమ్మతమగుచో నాకెట్టి యభ్యంతరము లేదనియుఁ దిరుగ తంతియొసఁగితిని. డాక్టరు తాను రోగుల సమ్మతి గైకొనుట వీలుపడదనియు నన్నే రమ్మనియు, రోగి కాహార మొసఁగు టలోఁ దనకు స్వాతంత్ర్యములేనిచో నామె ప్రాణమునకు బాధ్యత వహింపఁజాలననియుఁ దెలియఁజేసెను. వెంటనే యున్న రైలెక్కి డర్బనున కేఁగి చూచునప్పటికిఁ దానంతకుఁ బూర్వమే మాంస సమ్మిశ్రితాహార మొసఁగితినని చెప్పెను. అపుడు నేనిట్లంటిని, "భిషగ్వరా, ఇది మోసమని పరిగణింతును." "రోగుల కాహార మిచ్చుటలో మోసమేమియు లేదు. వైద్యులమగు మేమిట్టి మోసముల వలన రోగుల ప్రాణములఁ గాపాడగల్గుచో నది ధర్మముగనే భావింతుము" అని డాక్టరు నిశ్చలుఁడై పలికెను.

నాకెంతయో బాధ కలిగెను. చేయునదిలేక మౌనము వహించితిని. డాక్టరుదంపతులు మా కెనలేని సేవచేసిరి. వారి కెంతయో నేను ఋణపడియున్నాను. వారి వైద్యనీతి

మాత్రము నాకుఁ దృప్తినీయలేదు. అంతట మఱల నేనిట్లం టిని "ఆమెకు స్వయముగఁ గోరినఁదప్ప మద్య మాంస సమ్మిశ్రితాహారము నామె కొసఁగుటకు నేను సమ్మతింపను. ఇందుమూలమున నామె మరణించినను నేను విచారింపను."

"నీ సిద్ధాంత రాద్ధాంతముల కంతు పొంతులేదు. వాని కేమిగాని, నీభార్యకు వైద్యసహాయము చేయుచో మాకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలయును. ఇట్టి స్వాతంత్ర్య మును నీవు నిరోధింపఁబూనినచో, ఆమెను తీసికొని పొమ్మ నక తప్పదు. ఆమె మా వైద్యశాలలో బ్రతుకునవకాశముం డియు, మొండిపట్టుదల కాహుతి యగుట సహింపఁజాలను."

"ఆమెను తక్షణ మిచ్చటనుండి యెక్కడికి నేని గొంపొ మ్మనియేనా మీ యభిప్రాయము." "ఎప్పుడు నేనట్లంటిని ? ఆమెకెట్టి నిర్బంధములు లేకుండ స్వేచ్ఛగ నౌషధమిచ్చుటకు వీలుండవలయుననియే నాకోరిక. అటుల మాకామె యారోగ్య విషయమున స్వేచ్ఛ నిచ్చెదరేని ఆమెకు మా యోపినంత సేవ చెసెదము. ఆమెనుగూర్చి యెట్టి యాందోళనయులేక మీరు వెడలవచ్చును. ఈమాత్రము నీకర్థము గానియెడల, ఆమెను తీసికొనిపొమ్మని నాచేత చెప్పించుకొనుచున్నావనక తప్పదు."

ఈ సంభాషణావసరమున మహాత్ముని వెంట నాయన కొడుకులలో నొకఁడుండెను. అతఁడు తండ్రియభిప్రాయమున సంపూర్ణముగ నేకీభవించి, తనతల్లి మాంస సమ్మిశ్రితా హార పానీయముల ముట్టదని తెలిపెను. ఆమె నందుల కొప్పింపఁజూచుట యన్యాయమనియు నందులకుఁ దానును

నంగీకరింపననియుఁ దెలిపెను. పులి కడుపున మేక పుట్టునా? రత్నాలగనిలో గాజురాయి పొడమునా? 'బాలాదపి సుభాషిత' మ్మను సూక్తిఁ బాటించి మహాత్ముఁ డెంతయు ననంత సంతోష వారాసి నోలలాడె. తనయుల భాషణములు కర్ణయుగళ సద్భూషణములు, సంతోష పోషణములు గావా? కౌరవరాజసభానంతరమున నాఁడు ధర్మోపన్యాసముగావించిన భీష్మ ప్రముఖులకుఁ గొనియాడఁ దగినవాఁడైన వికర్ణుఁడు బాలుఁడేకాడా? నవనీత కోమల హృదయములందు హత్తుకొనిన సద్భావము లనంత ఫలప్రదము లగుటలో నాశ్చర్యమేమి? నిరంతర మాత్మస్థైర్యము నెచ్చించుచుఁ బొచ్చెము లేని సచ్చరిత్రమునకు బాత్రునిగావించు దైవ వాణియే యా బాల జలజాసనుని వదన పద్మమున నధివసించెనేమో!

అంతటఁగస్తూరిబాయి యభిప్రాయము నర్థించినాఁడు గాంధీజీ. అప్పు డామెస్థితి యెట్టి ప్రసంగమున కనుకూలమగునది కాదు. కాని గాంధీగారి కది తప్పసరియైన కర్తవ్య మనిపించినది. అతఁడు తనకును డాక్టరునకును జరిగిన సంభాషణమును క్రమముతప్పక నివేదించెను. అంతట నామె తన నిశ్చితాభిప్రాయము నిట్లు వ్యక్తీకరించినది: "నాకా బీఫ్ టీ వలదు. మానవత్వము దుర్లభము. అట్టి యనుచిత పదార్థములతో స్వచ్ఛమయ నియమములకు మచ్చ దెచ్చుకొనుట కంటెఁ జచ్చుటయే మేలు." అని నిష్కర్షగాఁ బలికెను. అతఁ డంత నామెతో నిట్లనియెను, "నీవు నా నిర్బంధమునకు లోను గావలదు. హిందువులలోఁ బెక్కురు మధుమాంసముల నాహారముగనో యౌషధముగనో గ్రహించుటకు సందియ

పడరు. కావున నీ యిచ్ఛచొప్పునఁ జేయుట కెట్టియభ్యంత రము లేదు." ఆమె యాపలుకు లాలించి, "దయయుంచి యిటనుండి యెటకేని మఱియొక చోటునకుఁ గొనిపొండు. నాకీ మద్య మాంసములు వలదు. మాధవుకృపయున్న జీవింతును. లేదా మృత్యువైనను సమ్మతమే. దేహములు బుద్బుదప్రాయములుగదా! వీనికై సమ్మనధర్మమునకు హాని యేల కలుగవలెను?" దిటవుమీఱఁ బలికిన తిలకినీ తిలకము నెమ్మోముఁజూచి యమ్మానసీయుఁడు సమ్మదమంది యామె నటనుండి తీసికొనిపోవుటకు నిశ్చయించుకొని తన నిశ్చయము డాక్టరునకుఁ దెలియఁజేయఁగా నతఁడు "ఎంతటి భల్లూకపు పట్టు పట్టెదవయ్యా నీవు?"అని విసుగుకొన్నాఁడు. సత్యారాధకుఁడు దూషణ భూషణ తిరస్కారములఁ బాటిం చునా? ధర్మమని తనకుఁ దోచినదానిని జంకుఁ గొంకులేక యాచరించికదా కృతార్థుఁడగును!

అచటికి స్టేషను దూరము. చిటపట చిటపట వాన కురియుచుండెను. డర్బనునుండి ఫోనిక్సునకు రైలుబండిపైఁ బోవలయును. అచటనుండి రెండునరమైలు రోడ్డు. అప్ప టికిఁగాని వారి నివాసము చేరరు. నిస్సంశయముగా నతని దత్యంత సాహసము. కాని దైవమం దచంచల విశ్వాసముతో నందులకుఁ బూనికొన్నాఁడు. ఇందులకుఁ గస్తూరిబాయియుఁ దోడ్పడెను. ఆమెకు భర్త యాపరిస్థితులలో నోదార్పు గూర్పవలసియుండ, నామెయే యతని కాశ్వాసము గూర్చు టయేగాక యామోదము గూర్చినది. ఉత్తమ నారీ లక్షణ మదియేకదా! "నన్నుగూర్చి మీరు దిగులొందకుఁడు"

అనియే యామె భర్తకుఁ బలుమారా దారియందుఁ దెలిపినది. "పరమేశ్వరుఁడునాకు శరణాగతుల రక్షింపను. ఆతని యిచ్ఛయే నెరవేరునుగాక."

కతిపయదినము లనారోగ్య పీడితయై సరియైన యాహారములేక కృశీభూతయై శల్యావశిష్టయై మొగమునమాత్రము పీడని చిఱునగవుమాత్రమే తోడవై యున్న యా లతాతన్వి నెట్లు గొనిపోవుట. రిక్షాలో నెట్లో స్టేషనునకుఁ దీసికొని వెళ్ళిరి. ప్లాటుఫారము విశాలమైనది. దానిపైకి రిక్షారాదు. రైలుబండిలో నెక్కుట కెంత ప్రయాస పడవలయును. అపుడామెను భర్త చేతులపై నుంచుకొని చాలదూరము తీసికొని పోయి రైలుబండిలో నెక్కించెను. ఫోనిక్సు చేరినపిమ్మట హేమక్కు అనఁబడు డోలీలో నెట్లో తమ యావాసమునకుఁ జేర్చెను. క్రమముగా గృహవైద్యముమీఁదనే యామెకు మఱల యారోగ్యము చేకుఱెను.

ఫోనిక్సువెళ్ళిన రెండు మూఁడు దినముల తరువాత నొక స్వామితల్లజుఁడు గాంధీ యాశ్రమమునకు వచ్చెను. అంతశ్శుద్ధిని బరిశోధింపవచ్చిన యే సిద్ధుఁడో, దివ్యుఁడో, నవ్యుఁడో కాని యతని శాస్త్రజ్ఞాన మపారము. శ్రీరాముని రాజ్యమునకు మఱలిరమ్మని తెలుపనేతెంచిన జాబాలి యేమో! అతఁడు మనుధర్మశాస్త్ర సిద్ధాంతము లేకరువెట్టఁ దొడఁగెను. మాంసాహారము నిషిద్ధముకాదని నిరూపించెను. ఎటులైనను కస్తూరి జీవితకమలము సురభిళము గాఁదగునని యే యతని యాశయము. అతఁడుద్ఘాటించు ధర్మసూత్రములలోఁ బెక్కు ప్రక్షిప్తములనుట జగమెఱింగిన విషయమే. సర్వ

శాస్త్ర పరిశీలనాయత్త చిత్తుఁడగు గాంధీమహాత్మునకీ విష యము వినూత్నముకాదు. అయినను కస్తూరిబా భావము గమనించుటకో యన్నట్లు ఆస్వామి ప్రసంగముల కభ్యంతరము సెప్పలేదు.

స్వామిచంద్రుని హితప్రసక్తి కస్తూరిబా గాఢ ప్రవృత్తికిఁ గళంకము తేఁజాలకపోయెను. చవిటినేలఁ గురిసిన వర్షమువోలె వ్యర్థమయ్యెను. బధిర శంఖారావము గావించువాని బోలి పరిహాసాస్పదుఁడయ్యె నీ యపర జాబాలి. "స్వామీ, నాకు శిరోవేదనగ నున్నది. నాకీ వాదములతోఁ బనిలేదు. స్మృతీతిహాసముల గొడవ నాకెందులకు ? సదాచారమునకు భిన్నమగు తెన్ను నేనెన్నఁడు త్రొక్కను. వాదింపఁ గుతూహల ముండినచో నా నాథునితోడను పుత్రులతోడను వాదింపుడు" అని ఖండితముగఁ బంపెను.

"వాదంబులు గాపాడంజాలవు శ్రీ దయితుఁడే గతి పామరుఁడా ?" "హరి పాదము పట్టర పామరుడా" యనిగదా విజ్ఞుల ప్రబోధము.

మహాపురుషుల జీవితములం దత్యంత స్వల్పవిషయములుగూడ మనోదార్ఢ్య విద్యావివేక బలయుతములై లోకాదర్శకములై యుండు ననుటకు మహాత్ముని యొక్కయు, తదర్థాంగి యొక్కయు దివ్య జీవితఘట్టములు పెక్కు నిదర్శకములు.

కస్తూరిబాయికిఁగలిగిన రక్తస్రావవ్యాధి ప్రబలమనో వ్యాధికిఁ దావలమయ్యెను. తుద కిందులకు ఆత్మ నిగ్రహముతోఁగూడిన ప్రకృతిచికిత్స యొండు మహాత్మునకుఁ దోఁచి

నది ఉప్పు పులుసులు మానివేయుట. అది దుస్సాధ్యమని కస్తూరీబాయి యభిప్రాయము. కాదని గాంధీగారి వాదము. "మీకొకవేళ వైద్యులు సలహా యిచ్చుచో" అని కస్తూరిబా యనుచుండఁగనే గాంధిగారు "తప్పక మానివేయుదును. సందియమేల? దుస్సాధ్యము కాదని రూపించుటకిదే యొక సంవత్సరపర్యంతము మానివేయుచున్నాను. నీవు మానినను, మానకున్నను సరియే. ఇది ప్రమాణము చేయుచున్నాను" అనెను. "అయ్యయో, మీ మనస్తత్త్వము గుర్తెఱిగియుఁ బనికిమాలినదానను మిమ్మలయించితిని. నా రోగమునకు మీ రేల పథ్య మవలంబింపవలయును? నేను తప్పక యుప్పు పులుసులు మానివేసెదను. మీరు మీ ప్రమాణము నుపసంహరించుకొనుఁడు" అని మొఱవెట్టుకొనెను. అనుష్ఠాన వైదాంతిక శిఖామణియగు బాపు "దైవమునకు మన మంచి చెడ్డలు తెలియును. దైవప్రేరణచే నా కా వాక్కులు వచ్చినవి కాని కామ క్రోధ వివశత్వమునఁగాదు. ఎందులకైన మంచిదియే. ఆత్మనిగ్రహము నవలంబింతును. ఉప్పు పప్పుల నొకవర్షము మానివేయుదును." అని దృఢమనస్కుఁడై పలికెను.

కస్తూరిబాయికి మాఱు మాటాడ నవకాశము లేదు. తన మూఢత్వమునకుఁ దన్నెంతయో దూషించుకొన్నది. పథ్య మవలంబించి ధన్య మూర్ధన్య యైనది. సర్వవిధములఁ దన్నిట్లు సన్మార్గవర్తినినిగావించు పతి లభించుటయు నతనితోఁ జర్చించి సారమెఱిఁగి యనుష్ఠానమున నకుంఠితముగ వర్తించుటయు నామె యుత్తర చరిత్రమునకు మెఱుఁగులు దిద్దినవి.

# 6. అంతర్వాణీ ప్రబోధము

దక్షిణాఫ్రికా ఖండమున నఖండము నక్షీణమునగు ప్రతాపముతో ఆసియాఖండవాసుల నత్యంత శోచనీయదైన్యమునకు హైన్యమునకు గుఱిసేయు శ్వేతజాతుల నెదుర్కొనఁ బూని సత్యము అహింస యను జోడు గుఱ్ఱములఁ బూన్చి, స్వధర్మనిష్ఠయను రథము నధిరోహించి సత్యాగ్రహ దీక్షాదక్షమగు నాత్మశక్తియే యమోఘ గాండివముగఁ బార తంత్ర్య నిర్మూలనోత్సుకుఁడై యల్లదె యుల్లము పల్లవింపఁ జేయు నవమోహనదాసుఁడు. రాజకీయ రణక్షేత్రమున నాధ్యాత్మిక కృషి సాగించు నతిలోక మాన్యుఁడగు నద్భుత హాలికుఁ డతఁడే. అమ్మహాపురుషునికి అధిజ్యధర్మనకు శ్రుతిపేయమైన యొక మధురరుతి శ్రుతి గోచరమైనది. నవమోహన మురళీగాన సదృశమై యతని హృదయాంతరాళమును పులకింపఁ జేయుచున్నది. సదమలమైన యతని మోము జాబిల్లి చిరునవ్వు వెన్నెలలు గాయుచున్నది. ఆ యాకస్మిక ప్రబోధామృత పూరమును దోరముగఁ గ్రోలి యమందానంద కందళిత నయనారవిందుఁడై యేమో తలపోయుచున్నాడు. "విశ్వజనసేవాపరాయణుఁడు ఐహిక భోగలాలసుఁడుగాఁడు. కామదాసుఁడు రామదాసుఁడు కాఁడు. మానవ సహజ సంతానవాంఛ కొంతదనుక ఫలించినవెనుక కేవలము దైహిక తృప్తికి స్త్రీ సాంగత్యము గోరుట యసంభావ్యము. పవిత్ర బ్రహ్మచర్య నిష్ఠచేఁ దప్ప మఱి యేవిధముననుమానవుఁడు ఘనతర కార్యముల సాధింపఁజాలఁడు." ఇట్టి తలంపులకు లోనై యున్నటులుండి బ్రహ్మచర్యము యావజ్జీవన వ్రతముగఁ బూన

సంకల్పించి యర్ధాంగలక్ష్మికి తత్సంకల్పము నెఱింగించెను. ఎఱింగించుటయే తడవుగ నామె తన యొడబాటు తన యొడయనికి నుడివికొన్నది. ఇంక నాతని సంకల్పమునకు వికల్పము గలదా! నాఁడు బుద్ధభగవానుఁడు తాను వైరాగ్యదీక్ష నుద్దేశించినపుడు యశోధరాదేవిని గను గ్రామి చనినాఁడు గాని యిట్టులాడంబరచెనా? స్త్రీలకు బురుషులకంటెఁ గామతృష్ణ మెండనియు, నిగ్రహశక్తి తక్కువ యనియు, స్త్రీలు నిరంతర చంచల చిత్తలనియు లోక మాడిపోయును గాని స్త్రీ సహనమూర్తి, పవిత్రానురాగవర్తిని యని గ్రహింపనేరదు. అట్టి మహితాదర్శమును లోకమునఁ బ్రతిష్ఠించిన పతివ్రతామతల్లులలో నత్యున్నతశాఖకుఁ జెందిన తిలకినీ తిలకము కస్తూరిబాయి.

నాఁడు మొదలుకొని మహాత్ముని హృదయము నిష్కళంక ప్రేమకుఁ దావలమైనది. భార్యాభర్తలు పరస్పరార్థోగతులకుఁ దోడ్పడీయువారుగాక పరస్పరాధ్యాత్మికోన్నత్యమునకుఁ దోడ్పడు టెంతటి యౌచిత్యము! అది సంస్తుత్యము గదా! ఇపుడు కస్తూరిబాయి భర్తృనిర్బంధ వినిర్ముక్త. గాంధీజీ యిఁకఁ జెప్పఁ బనిలేదు. ఐహిక దైహిక బంధముల సమూలముగ విచ్ఛేదమొనర్చిన వీరుఁడు. అతఁ డెన్నఁడును పరిహాసమునకైనను పరస్త్రీ ముఖావలోకనము జేసి యెఱుఁగఁడు. కలనైనఁ బరకాంత దలచియుండఁడు. అతనిలోఁ గామతృష్ణ రేకెత్తింపఁగలది యొక కస్తూరియే. ఆమె విషయము ననే విషయవాంఛలు విడనాడిన మహనీయుడు పరనారీ సాంగత్యము నిచ్ఛగించునా? అతనికి స్త్రీ లోకమేమాతృ

రూపముననో దుహితృరూపముననో సోదరి రూపముననో గోచరించినది. ఇట్టి దృఢతర దీక్షకుఁ దోడ్పడి భర్తను లోకోత్తర మహానాయకునిగ లోకమునకుఁ బ్రసాదించిన యఖండ గౌరవమునకుఁ బాత్రమైనది మాననీయ మానినీవసంతము మాతృశ్రీ.

బ్రహ్మచర్య దీక్షాస్వీకార కాంక్ష మహాత్మున కావశ్యముగఁ దత్పూర్వము కొన్నియేండ్లుగఁ గన్పట్టుచుండినను, అంతర్వాణీప్రబోధ శంఖారావము శ్రవోగోచర మగుదనుక వాయిదాపడుచునచ్చెను. ఇట్లుపేక్షించుటకుఁ గారణములు రెండు. ఒకటి ఆత్మసంయమనమున నవిశ్వాసము, రెండుకస్తూరి యీవిషయమున సహకరింపదేమో, కామవిజయమున నామె వెనుకబడునేమో యను ననుమానము. రెండవ యూహకు మొదటిదే మూలము. అందుననే యతఁడంతకాలము త్రోసి పుచ్చినను, తుదకు దీక్షాస్వీకారమునకు ముందుగ నామెతో నీ విషయము సంప్రదింపలేదు. అట్టి యవసరమును గలుగ లేదు. ఆమె కావిషయ మెఱుక సేయుటతోడనే యామె తన యంగీకృతి తెలిపెను. గాంధీగారే స్వవిషయమున నను మానించి సర్వజీవ శరణ్యుఁడగు వాసుదేవు చరణారవిందముల శరణు జొచ్చెను. అతఁడేగదా తన హృదయ పరివర్తనకు హేతుభూతుఁడు. అతఁడేగదా తన్నీయఖండ మానవసమాజ సేవాక్షేత్రమునఁ బ్రవేశింపఁజేసినది. అతఁడే సాగింపకుండునా మానసదార్ఢ్యము నొసఁగి యీయకలంక బ్రహ్మచర్య దీక్షా వ్రతమును.

సత్యాగ్రహ సమరమునఁ గాలిడినాఁడు గాంధీజీ, కస్తూరిబాయి కిట్టి యుద్యమములు రుచించునో లేదో, దీని కఖండ త్యాగము వలయునుగదా యని యనుమానించి యీ విషయ మామెకు బోధింపకుండెను. సత్యాగ్రహోద్యమమునఁ బాల్గొనుచున్న పురుషులతోఁబాటు స్త్రీలునుగలరు. వారికి మహాత్ముఁ డుద్యమ తత్త్వమును సత్యాగ్రహు లవలంబింపఁదగిన విధానమును బోధింపఁదొడఁగిన యవసరమున ముందుకువచ్చి మాతృశ్రీ యిట్లు నుడివెను: "నా కీ విషయము మీరు బోధింపకుండుటచే విచారము కలుగుచున్నది. కారాగృహమున కేగకుండుటకు నాకుఁగల యయోగ్యత యేమి? మీ రితరుల నేపథమున కాహ్వానించుచున్నారో దానిని నేనును అనుసరింపఁగోరుచున్నాను." అందులకు గాంధీజీ యిట్లు సమాధానము చెప్పెను: "నీకు బాధకలిగించుట నాకు సమ్మతముగాదు. నిన్నుగూర్చి విశ్వసింపకుండుట చర్చనీయముకాదు. నీవు నా నిర్బంధముచే కారాగృహమున కేఁగుటకాదు గాని నీకు స్వయముగ నట్టియుత్సాహముండినచో నది నాకు హర్షదాయకము నిస్సంశయముగా. ఇట్టి విషయములలోఁ బ్రతివ్యక్తియు దన్నుదాను సంప్రదించుకొని, తగిన ధైర్య స్థైర్యములు లుండిననే పాల్గొనుట యుచితము. పతియాన జవదాటరాదను భావమున నీవు ఈ దుష్కర కార్యరంగమునఁ బ్రవేశించినయెడల ఇందలి సాధక బాధకములకు బాధ్యుఁడ నేనగుదునుగదా? నీవు న్యాయస్థానమున విచారణ సమయమున జంకినను, కారాగృహశిక్షల సహింపజాలకున్నను అందులకు నేను పశ్చాత్తాపపడవలసి యుండును.

బుద్ధిపూర్వకముగ బాగోగులెఱిఁగిపూనుచో నీవు, నా కెట్టి యెడను సంతాపము కలుగదు." ఆ నారీమణి యిట్లు పలికెను "నావిషయమున నెట్టి యాశంకయు మీకు వలదు. కారాగృహశిక్ష యోర్వఁజాలనిదిగఁ దోఁచినచో క్షమాపణగోరి విడుదల వడసి వత్తును. మీరును పుత్రులును సహింపఁగలిగిన శిక్షలను నేనేల సహింపజాలను ? నేను తప్పక యీ సమరమునఁ బాల్గొందును." నరకునిపై కి దాడి వెడలినపుడు సమరోత్సవమున కుత్సహించిన సత్యాదేవిని తలపించుటలేదా ? శ్రీకృష్ణుఁడు సత్య ననుమతించినట్లే యత్యంత సమోదమున మోహనదాసుఁడును కమనీయ సౌకుమార్య సౌహార్దముల కెల్లయగు సతీమణి నంగీకరించెను.

తొలుత సమరోత్సాహముజూపి తరువాత చదికిలఁబడలేదు కస్తూరి. ఈ సత్యాగ్రహ సమరము నిరంతరముగ నాలువత్సరములు సాఁగినది. అనేకపర్యాయములు గాంధీజీయును కస్తూరిబాయియును కారాగృహబద్ధులైరి. కస్తూరి బాయి వీరుఁడగు తన భర్తకుఁ దీసిపోని ధైర్య స్థైర్యములఁ బ్రదర్శించెను. సమరారంభ దశయందుఁ దన ప్రాణేశ్వరుఁడు పఠానుల చేతులలోఁబడి మృత్యుగహ్వరమునఁ బడినయంతటి దురవస్థకుఁ బాలగుట గాంచినది. సమరముతీవ్రమై యత్యుచ్చస్థాయి యందున్న సందర్భమున సామాన్యునివలె రాళ్ళను పగులఁగొట్టుటకు నిర్బంధింపఁబడిన భర్తను జూచినది. ఫోనిక్సు ఆశ్రమమునందలి సభ్యుల మనఃపరివర్తనమునకు

పదునాలుగుదినములు నెఱపిన యుపవాసవ్రతమును కనులారఁ గాంచినది. తుదకీ సమరమున విజయలక్ష్మీ సమేతుఁడై దేశీయుల మన్ననలకుఁ బాత్రుఁడైన తన ప్రాణపతిని బడసి నాఁడు జము నెదిరించి భర్తృప్రాణములఁ బడసిన సావిత్రిని బోలినది మన మాతృశ్రీ.

# 7. భారతదేశ పునరాగమనము

**1915** జనవరి నెలలో గాంధీజీ కస్తూరిబాయియు బిడ్డలును తిరిగి హైందవధాత్రికివచ్చిరి. ఆ సంవత్సరము మే నెలలో అహమ్మదాబాదులో సత్యాగ్రహాశ్రమమునకుఁ బునాదులు వేయఁబడినవి. అది కాలక్రమమున గాంధీజీకిని అతని కుటుంబమునకు గృహమయ్యెను. అదియే సత్యప్రయోగశాలయయ్యెను. ఆ యాశ్రమమునందు సభ్యులుగఁ జేరినవారిలోఁ బ్రథమగణ్య కస్తూరిబాయియే. ప్రథమ సముదాయము గాంధీజీతోఁగలసి స్త్రీ పురుషులు ఇర్వదియైదుగురుమాత్రమే. అందఱి కొకేపాకశాల భోజనశాల. వారందఱు నొకే కుటుంబముగ మెలంగిరి. బాలసభ్యు లందఱును కస్తూరిబాయిని కేవలము తమతల్లిగ భావించు చుండిరనుట యందెట్టి యనుమానము లేదు. ఈ స్థితియందుఁ జూచిన సుప్రసిద్ధ మహాకవయిత్రి శ్రీమతి సరోజినీనాయుడు కస్తూరిబాయి స్వరూపచిత్రణ మిట్లు గావించెను.

'ఆమె తనభర్త పార్శ్వమున, నిరాడంబరముగను, పవిత్రముగను, గంభీరముగను విజయవేళ నున్నట్లే, ఆపత్సమయమునను గూర్చుండెను. ఆమెలో విదేశమున నొకచేత స్వదేశీయ గౌరవజ్యోతిని బూని రెండవచేతితో గాయపడిన యోధులకు బాధాపనయార్థము పాటుపడు మూర్తి గోచరించెను. గోఖలే చెప్పినరీతి మృత్తికనుండి మహావీరుల సృజించు దక్షిణాఫ్రికా మహానాయకుఁడు అత్యంతాల్పాహారము బుచ్చుకొనుచు అనారోగ్యముతో నేలపైఁ బరుండ, నతని ధర్మపత్ని సామాన్య గృహిణిరీతి గృహస్థకార్యము లనేకము

లగువానియందు నిరంతర నిమగ్నయై యుండెను. తానొక ప్రపంచ విఖ్యాత మహాపురుషపుంగవుని జీవిత భాగస్వామిని ననియు మహాకీర్తి ప్రతిష్ఠలఁ గాంచియుంటిననియు గర్వించుట కస్తూరిబాయియెడ నెందును దోపదు.”

ఆశ్రమ జీవితము మొదటినుండియు సుకరముగ నుండ లేదు. ఆశ్రమనిబంధనలు సిద్ధపరచునపుడు అస్పృశ్యుల ప్రవేశముగూర్చి ప్రస్తావము జరిగెను. అపుడు గాంధీగారు స్పష్టముగఁ జెప్పెను. ‘అర్హుఁడైనచో అస్పృశ్యుని తప్పక ఆశ్రమమున కనుమతించెద’ నని. అటుపిమ్మట కొన్ని నెలలు గడచియుఁ గడవకపూర్వమే అస్పృశ్యుల కుటుంబమొకటి యాశ్రమ ప్రవేశము గోరుచు వచ్చెను. వారాశ్రమ నిబంధనల కంగీకరించిరి. గాంధీజీ తోడివారిని సంప్రదించి యాకుటుంబమునకు సభ్యత్వ మంగీకృతమైనటులు తెలిపెను. వారి ప్రవేశము వలన ధనసహాయ మొనరించు వెలుపలి మిత్రుల కును ఆశ్రమమందలి వారికిని గాంధీజీయం దనిష్ట మేర్పడెను. ధనసహాయ మాగిపోవుటతోఁబాటు సంఘ నిషేధము గూడ జరుగునటులు వదంతి పుట్టెను. గాంధీజీ ఆర్థిక దుస్థితికిఁ దగిన నివారణోపాయమును సమాలోచించెను. కాని యాశ్రమములోని తుపాను అతని శక్తి సామర్థ్యములకు పరీక్ష యాయెను. కస్తూరిబాయియు ఆశ్రమములోని యితర స్త్రీలును అస్పృశ్యులను తోడివారుగ స్వీకరించుట కొడంబడరైరి. గాంధీజీ యిట్టి పరిస్థితులలో ఆశ్రమ సభ్యురాండ్రను ముఖ్యముగా కస్తూరిబాయిని తనమార్గమునకుఁ దీసికొని రాఁజాల నందులకు మిగుల విచారించి, తుదకు ఏడుదినము లుపవాస

దీక్ష వహించెను. ఈ యేడుదినములలో క్రమముగ కస్తూరి బాయి హృదయమున పరివర్తనము కలిగెను. అస్పృశ్యతా నివారణ సూత్రము మున్నగు సిద్ధాంతముల నాచరణమునఁ జూపుటకే యాశ్రమ స్థాపనము జరిగెననియు, తత్సిద్ధాంతా చరణము వినా యాశ్రమమున కునికిలేదనియు, ఇంతేల ఆశ్రమమునకు ఆత్మయగు మహాత్ముఁడు లేనిపిమ్మట నాశ్రమమః నిరర్థకమనియు గ్రహించెను. ఆమెపట్టుదల పూర్తిగ సడలి పోయెను. ఆమెకు అస్పృశ్యులయందున్న నిరసనభావము పూర్తిగఁ దొలఁగిపోయెను. హైందవ మతమునకు గళంక మైన అస్పృశ్యతను తొలఁగించుటకుఁ దనభర్తకుఁ బూర్తిగ సహకరించెను.

కస్తూరిబాయికి దీనులయందు సహజముగ సానుభూతి గలదు. 1917 లో గాంధీజీ చాంపరాన్ జిల్లాయందలి పల్లె టూరివారిని నీలిమందు పరిశ్రమచేయు తెల్లవారికి బానిసలుగ నుండు నైచ్యముఁ బాపుటకొక యుద్యమము నారంభించెను. అపుడాతఁడా పల్లెటూరి ప్రజలకు విద్యాభ్యాస మవసరమని గ్రహించి, వారిలో జ్ఞానజ్యోతిని వెలిగించు నిమిత్తము మహి ళల నియమించెను. ఈ మహిళలయందు కస్తూరిబాయియుఁ గలదు. ఆమె యుపాధ్యాయులలో నొకర్తుక. వ్రాయను జదు వను రాని యీమె యెట్లుపాధ్యాయురాలు గాఁగలిగినది గమనార్హము. శుచి శుభ్రతలు, నీతినియమములు, క్రమ శిక్షణాదికము బోధించుటయే యీమె విధ్యుక్తము. పల్లెలకుఁ బోయి యందలి స్త్రీలెందులకు దమ వస్త్రముల నుదుకు కొనరో కనుగొని, వారి కుదుకుకొనుట నేర్పుపనికి కస్తూరి

బాయి నియమింపఁబడెను. ఆమె యట్లు పరిశీలనముగావింపఁగా నా జానపదస్త్రీలు రెండవ వస్త్రము లేకుండుటచే వస్త్రము లుదికికొనరని తెలియవచ్చెను. వారిలో నొకర్తు "నాకు రెండవ చీరెను పంపుమని మహాత్మునికిఁ జెప్పు" మనెను. వారి దారిద్ర్య మట్టిది. దారిద్ర్య పీడిత ప్రజానీకమునకు జేయవలయు సేవారహస్యములన్నియు నామె గ్రహించెను.

# 8. అరెస్టులు, బందిఖానాలు

**1921** లో మహాత్మునిచే ప్రారంభింపఁబడిన సహాయ నిరాకరణోద్యమమునందును 1930, 32 సంవత్సరములలో నిర్వహింపఁబడిన శాసనోల్లంఘనోద్యమములందును ఆమె ముఖ్యపాత్ర వహించినది. అనేక పర్యాయములు కృష్ణజన్మ స్థానమున కేఁగినది.

1922 మార్చిలో గాంధీజీ అరెస్టు గావింపఁబడి, తీవ్రముగ విచారింపఁబడి ఆఱేండ్ల కారాగృహశిక్ష విధింపఁబడెను. అప్పుడు కస్తూరిబా కార్యరంగమున దుమికి ధైర్యసాహసములతో ముందునకు వచ్చి దేశీయుల నుత్తేజితులూగించు మహోత్తమ సందేశము నిట్లొసంగెను.

మత్ప్రియ దేశీయ సోదర సోదరీమణులారా,

నా హృదయేశ్వరుఁడు ఆఱు సంవత్సరముల కారాగృహశిక్ష విధింపఁబడినాఁడు. ఈశిక్ష నాహృదయమును గుఱింగఁజేయు చున్నను, అతని శిక్షా కాలపరిమితిని తగ్గింపఁగలమను తలంపు నాకు ధైర్యము నొసఁగినది. మనప్రయత్నములద్వారా అతనికి విధింపఁబడిన శిక్షా కాలము ముగియుట కెంతో ముందుగ నతనిని విడిపింపఁగలము.

భారతదేశము జాగృతమై కాంగ్రెసు నిర్మాణకార్యమమును పట్టుదలతో నాచరింపఁబూనినచో, మన మతనిని విడిపించుటలో విజయమందుటయేగాక కడచిన పదునెనిమిది నెలలుగా మనము తీవ్రముగ వేనికొఱకుఁ బోరాడుచుంటిమో ఆ కోరికలన్నియు సిద్ధింపగలవు.

కావున దీనికిఁ బ్రతీకారము మనచేతనున్నది. విఫలుల మైత్రిమా, ద్వేషము మనదియే. నాయందు సానుభూతియు, నాభర్తయందు గౌరవమునుగల వారినెల్ల నేనర్థించునది యే మనః హృదయపూర్వకముగ విజయవంతముగ సాగింపుఁ డనియే.

నిర్మాణకార్యక్రమము నందలి యంశములలో నతని కత్యంత ప్రియములు నూలువడకుట, ఖద్దరు నేయుట. వీని యందు మనము విజయమందఁ గలిగినచో భారత దేశార్థిక సమస్య పరిష్కృతమగుటయేగాక రాజకీయ పారతంత్ర్య విమోచనము సైతము ప్రాప్తింపఁగలదు. గాంధీజీ శిక్షకుఁ బ్రథమ ప్రతికృతియేమన:

(1) స్త్రీ పురుషు లెల్లరును విదేశీయ వస్త్రముల విసర్జించి ఖద్దరును తాము ధరించుటయేగాక యితరులుగూడ నట్టులే యొనర్పఁ బ్రబోధింపవలయును.

(2) స్త్రీ లెల్లరును నూలు నడకుట తమ పవిత్రధర్మముగ భావించి నూలు తయారుచేయుచు నితరులు నట్లు చేయునట్లు ప్రోత్సహింపవలయును.

(3) వర్తకులెల్లరు విదేశీయవస్తు క్రయ విక్రయములు విరమింపవలయును.

హిమవచ్ఛృంగము లత్యున్నతములు. అతివిశాలము నత్యంత గంభీరము హైందవాబ్ధి. ఉత్తర దక్షిణ దిగ్భాగము లందీ గట్టులరాయఁడును కడలి యొడయఁడును క్రమముగఁ గలిగిన యీపవిత్ర భూఖండము మహీమండల మండనాయమగుట కిందు జనించిన మహాసీయుల సమతాదర్శమే.

భారతదేశము పరతంత్రమగుటకు ముఖ్య కారణము లలో నొకటి దేశీయులలో అందును హిందూ మహమ్మదీయు లలోఁగల యనైక్యమే. బ్రిటీషువారు వీరిలో వీరికి ద్వేష మును రగుల్కొల్పి సామ్రాజ్యము సుస్థిరముగావించుకొనఁ జూచుచుండిరి. శృంఖలాబద్ధమైన దేశ మాతృ మూర్తి గోచరించినది మహాత్మునకు. సంకెలలో విడగొట్టుటకుఁ దీవ్రయత్నము సాగింప దీక్షఁ బూనినాఁడుగదా యతడు. ఆత్మార్పణము గావించుటకునైన వెనుదీయఁడు. అందుననే భారతీయులలో మనస్తత్త్వము మార్పుచెందుటకు నిరశన దీక్ష నెన్నిపర్యాయములోఁ బూనినాఁడు. అవి సత్ఫలితము లిచ్చుచు వచ్చినవి. అట్టి కఠినదీక్షలు కస్తూరిబాయికి ప్రాణ గొడ్డము లయ్యెడివి. భర్తృ ప్రాణరక్షణార్థము పరమేశ్వరు చరణముల శరణుచొచ్చెడిది. ఆమె మొఱాలకించి యాగజేం ద్రవరదుఁ డామెకు దీర్ఘ సుమంగలీత్వము ననుగ్రహించెను.

హైందవ మహమ్మదీయ సఖ్యము నిమిత్తము గాంధీజీ యిర్వదియొక్కదినము దీర్ఘోపవాసము ఢిల్లీలో 1924 సెప్టెం బరు నెలలో గావించినపు డతనిని కస్తూరిబా గావించిన మౌన ప్రార్థనలే రక్షించినవి. నాఁడు సావిత్రి జమునెదిరించి భర్తృ జీవములఁ బరిగ్రహించినదిగదా. తత్తుల్యమై కస్తూరిబాయి వరలినదీ సందర్భమున ననుట కెట్టి సందియములేదు. ఆమె మరణించుటకుఁ బూర్వమిట్టి యగ్నిపరీక్షల కెన్నిపర్యాయ ములో లోనై విజయ విరాజిత యయ్యెను.

1932, జనవరి 15 వ తేదీనాఁడు క్రిమినల్ లా అమెన్డుమెంటు ఆక్టుప్రకారము ఆఱువారములు చెఱసాలలో

నుంపఁబడెను. విఘుదలయైనపిమ్మట మార్చి 15 వ తేదీనాఁడు కఠినమైన కారాగృహశిక్ష విధింపఁబడెను. ఇట్లు దేశమున రాజకీయ విప్లవము జరిగినపుడెల్ల నీమె కారాగృహమం దుంపఁబడుచుండెను.

1935 ఏప్రిలు మాసమున గాంధిజీ సాబర్మతాశ్రమ మును రద్దుచేసి, వార్ధాసమీపమున సేవాగ్రామమును తన ప్రధాన వాసస్థానముగ నేర్పఱచుకొనెను. అప్పుడు కస్తూరి బాయి సాబర్మత్యాశ్రమ మందువలెనే యత్యుత్సాహముతో నాశ్రమ నిర్వహణ బాధ్యత వహించెను. సేవా గ్రామము నందలి యామె జీవితవిధానము నభివర్ణింపఁబూని ఎలాసేన్ అను నొక మహిళ యిట్లు నుడివినది :

"ఆమెనుగూర్చి యెట్టిప్రస్తావము వార్తా పత్త్రికలలోఁ గాని యుపన్యాసవేదికలందు గోచరింపదు. కాని సేవాగ్రామ మున కామెయే జీవగఱ్ఱ. అందలి కృషికెల్ల మూలమామెయే. ఆమె యనిర్వచనీయమైన సహనము సద్భావము గలది. భారతదేశమునకు గర్వకారణములగు సర్వ సుగుణములు నామెకుఁ గైవసములు. ఆమె తన యనుంగు భర్త యారం భించు ప్రతి యుద్యమమునందును బాల్గొనును. అమ్మహా నీయునివలెనే యిమ్మహనీయురాలును దేశమునకుఁ గావించు త్యాగములు నిరంతరస్మరణీయములు.

'గాంధీజీ, హైందవసమస్య' యను గ్రంథమునఁ దత్కర్త యామెనుగూర్చి యిట్లు ప్రస్తావించెను :

"గృహనిర్వహణమున నందెవేసినచేయి యనఁదగిన యిల్లాం(డకు మేలిబంతియగు నీ యింతి మంచువంటి తెల్లని

చీరెను ధరించి యాశ్రమవాసులకెల్లఁ దల్లియై యెల్ల యక్క-
అలఁ దీర్చు మనోహర దృశ్యముకంటె హృద్యమగునది భారతదేశమునఁ గానరాదు.”

1939 నాఁటి రాజకోటలోని రాజకీయాందోళనమున నామె బలహీనయై యనారోగ్యవతియై యుండియుఁ బాల్గొనెను. సంస్థానాధికారులు ఎట్టి విచారణ సేయకయే స్త్రీల నెల్లఱ చెఱసాలలకంపిరి. వారిలో కస్తూరిబాయియుఁగలదు. ప్రమాద భరితమైన యామె సాహసముఁగూర్చి గాంధీజీ హరిజన్‌లో నిట్లు వ్రాసెను:

“రాజకోట పోరాటమున నా భార్య పాల్గొనుటఁ గూర్చి నేనేమియు వ్రాయఁదలపెట్టలేదు. కొందఱు ఈ విషయమునఁ గావించిన క్రూరమైన దుర్విమర్శకు సమాధానము నొసఁగక తప్పుటలేదు. ఆమె యీ పోరాటమునఁ బాల్గొనవలయునను తలంపే నాకుఁగలుగలేదు. అందులకు ముఖ్యకారణము శాసనోల్లంఘనాది విప్లవోద్యమములందు సంభవించు విపరీత కష్టముల భరింపఁజాలని వృద్ధాప్యమున నుండుటయే. విమర్శకులకు వింతగఁగన్పింప వచ్చును గాని యామె నిరక్షరాస్యయైనను కొన్ని సంవత్సరముల నుండియు నిచ్చవచ్చిన తెఱఁగున వర్తించుటకామెకు సంపూర్ణస్వేచ్ఛగలదనుట యథార్థము. దక్షిణాఫ్రికాలోఁగాని ఇండియాలోఁగాని యామె తన యంతరాత్మ ప్రబోధముననుసరించియే సత్యాగ్రహాది విప్లవోద్యమములందుఁ బాల్గొనినది. ఇప్పుడు నట్లే గావించినది. మణిబెను నరెస్టుగూర్చి యామె వినినతోడనే యుద్రిక్తయై తన్నుఁబోనిమ్మని నన్నడిగినది. ‘మిక్కి-లి

దుర్బలస్థితి యందుంటి' వని యంటిని. అంతకుఁ బూర్వమే యామె స్నానపుగదిలో మూర్ఛిల్లెను. సమయమునకు దేవదాసు మనోనిశ్చలతతోఁ గాపాడకుండినచో నామె యిప్పటికి పరలోకమునందు ప్రాతకాపై యుండెడిదే. ఈ విషయమును ప్రస్తావించి వారించినపుడామె, 'పరవాలే'దనెను. సర్దారునకీ విషయము తెలియఁజేసితిని. అతఁడును పెడచెవినిపెట్టెను.

రెసిడెంటు ప్రోత్సాహమున ఠాకూరుసాహెబు వాగ్దానభంగము గావించినందులకు నాకపరిమితమగు దుఃఖము గలిగినది. కస్తూరిబాయి రాజకోటయందు పుట్టినది. దీని నామె తనకుసంబంధించినదిగా భావించినది. సంస్థానమునందలి స్త్రీ పురుషు లెల్లలు స్వాతంత్ర్యమునకు బాధనొందుచుండఁదా నూరకుండలేక పోయినది. రాజకోట పోరాటమునందలి విజయము దేశ స్వాతంత్ర్య సంగ్రామమునందొక ముఖ్యదశ యనఁదగును. త్వరగనోఁ ఆలస్యముగనో యిందు విజయము తప్పదు. అప్పుడు కస్తూరిబాయి తనశక్త్యనుసారము గావించినకృషి గణనీయము గాకపోదు. శారీరకముగ వృద్ధులును దుర్బలులును సైతము దృఢమైన హృదయములు గలవారైనచోఁ బాల్గొనఁదగినది సత్యాగ్రహ సమరము."

మహాత్ముఁడు మరణపర్యంతనిరశనదీక్షను రాజకోటయందూనిన సందర్భమున కస్తూరిబాయి కారాగారమున నుండెను. ఈవార్తనువిని మహాత్ముని కిట్లు మృదువుగ పలికెను: "అర్ధాంగినగు నా యనుమతినైనఁగొనక యిట్లొనర్చు టన్యాయము గాదా?" ఈనిరసనమునకిట్లు పురుషోత్తమాంశ సంభూతుఁడు సమాధానించెను: "ఇది దైవవాణి. అది వచ్చినసమ

యమున నెవరియనుమతి గ్రహింప ననువుపడదు. భగవంతుని యాన నిర్వహించుటకుఁ దగిన యవకాశము నాకు లభింపఁ జేసి యందులకు మీకు సంతోషింపవలయునుగాని దుఃఖింపఁ బనిలేదు. నిరశనదీక్ష వహించుటకుమున్ను నాకే తెలియదు. దైవసంకల్పానుసారము తదాజ్ఞ వెనువెంటనే శిరసావహింపక తప్పదు. భగవంతుఁడు తన సన్నిధికి నన్నాహ్వానించిన తరుణమున నీయనుమతినిగాని మఱెవ్వరి యనుమతినిగాని పొందుటకు వీలు చిక్కునా?”

ఈతరుణముననే గాంధిగారామెకొక సందేశమంపెను. ఉపవాసమయమున తాను తన భర్తృసన్నిధిని నివసింపఁ గోరినచో నట్టివీలు గల్పింపఁడని ప్రభుత్వమునకు వినతినంపె దనని యతఁ డామెకు దెలియఁజేసెను. కస్తూరిబాయి సహజ స్వభావమును వెల్లడించుచు నిట్లు తెలియఁజేసెను. “వలదు, వలదు, ఏమాత్రమును వలదు. నాకు ప్రతిదినము ఆయనను గూర్చిన వార్తలు చేయుచుండనిచ్చినఁ జాలును. ఇతఃపూర్వ మతని జతనములలోఁ దోడ్పడిన భగవంతుఁడే యీ గండ మునుగూడఁ గడపి కాపాడఁగలఁడు. కాని యతఁడిట్లు మాటి మాటికిఁ దాను తన్నిట్లు ప్రాణగొడ్డములఁ బాల్సేసికొనుట లగ్గుగాదు.” అందులకు మహాత్ముని సమాధాన మిట్లుండెను: “అగు నట్లే యగుఁగాక. ఆత్మకు సంబంధించిన నిరశనదీక్ష దాని ఫలితముఁబట్టి యిట్టిదని నిర్వచింపవలనుపడదు. ప్రత్యాఖ్యానము సేయక సంతోషపూర్వకముగ దైవాభీష్టమునకుఁ దల యొగ్గుటలోనే యా దీక్షాస్వభావముఁ దెలియనగును. అత్యంత మహత్తరమైన ధర్మమునునిర్వర్తించుచో మరణ

# 9. తుది అరెస్టు

ఆది భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్రయందు చిరస్మరణీయమైన దినము. 1942 ఆగష్టు తొమ్మిది. నాఁడే బాపూజీ ప్రభృతులు, భారతజాతీయ నాయకులు, కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు తెల తెల వాఱకుమున్నె జైళ్ళకు తరలింపఁబడిరి. భారత దేశము నందలి యన్నిప్రాంతము లందును నియ్యత్యాచారము జరిగినది.

ఆసమయమున కస్తూరిబాయియు తన భర్తతో బిర్లా భవనమున నివసించుచుండెను. భర్తృచరణ దాస్యమునఁ గృతార్థ యగుటయేగాక యీ మహనీయుని యడుగుజాడల ననుగమించుట యీకాలమునఁ జరితార్థ చరిత గావలయునని యామె కుత్సాహము గలిగినది. తత్క్షణమే భర్త నిర్వహించుచున్న పాత్రను తాఁబూనినది.

ఆనాఁడు శివాజీ పార్కునొద్ద బ్రహ్మాండమైన బహిరంగ సమావేశము. అందు భారతజాతి జనకుఁ డుపన్యసించునని ప్రకటింపఁబడినది. ఏతత్సంరంభము గూర్చియే ప్రభుత్వ మడలిపోయి నాయకుల నరెస్టు గావించినది. కృతనిశ్చయయై యున్న కస్తూరిబాయి గాంధీగారి ప్రబోధశంఖమును దాను బూరింప సన్నద్ధయైనది.

ఈ వార్త యందినది ప్రభుత్వాధికారులకు. వారు కారులలో దిగినారు బిర్లాభవన ప్రాంగణమున నాఁటి సాయం సంధ్యావేళ. 'ఏమమ్మా, శివాజీ పార్కులో నేఁడుపన్యసింతువా ?' అను వారి పృచ్ఛకు నదురు బెదురులేక తడవు

కొనక 'ఔను' అనునదియే యామె సమాధానము. వెంటనే వారామె నరెస్టుచేసిరి.

కస్తూరిబాయి ననుగమించిరి ప్యారిలాలు, డాక్టరు సుశీలనాయరు అను వారు. గాంధీజీ యుండిన కారాగృహము నకే పూనాలోని యాగాఖానుభవనమునకే కస్తూరిబాయియుఁ దీసికొని వెళ్ళఁబడెను.

ఇదియే యామె తుది కారాగారవాసము. ఇఁక బాహ్యజగజ్జ్యోతినిజూచి యెఱుఁగదు, సేవాగ్రామమునందలి పటకుటీర వాసమునందలి మక్కువ మట్టిపాలయ్యెను.

## 10. ఆమయపీడనము

మృత్యువు మర్త్యజీవుల పుట్టినదాది వెన్నంటియేయుండును. అనుక్షణ మది వికృతాట్టహాసము గావించుచుఁ గరాళ దంష్ట్రలతోఁ గబళింపఁజూచుచుండును. జరా రుజలు దాని మూఁతలు. జీవులతలలు సింహాసనములుగా నవి యుల్ల సిల్లును. ఇవి వెన్నంటనే జీవులను మృత్యుముఖమునకుఁ జేర్పవు. తమ లీలావినోదములు గొంతకాలము సాఁగించును.

పాపము, కస్తూరిబాయికి కారాగృహ వాసమునకుఁ దోడు దుర్భరముగు గుండెజబ్బు. దేశ స్వాతంత్ర్య సంగ్రామ రంగమున కరికి యందు ఆత్మబలిదానము గావింప సిద్ధమైన వీరనారీశిరోమణి; మహాత్మునియాత్మేశ్వరి; వృద్ధాంగన; తీవ్రామయపీడ వృద్ధాప్యమునకుఁ దోడయ్యెనేయను కరుణ స్వభావసిద్ధము. ఆగాఖాను భవనవాసము, అత్యంత నిపుణు లగు భిషఙ్మణుల వైద్యసహాయము, స్వకుటీర వాసముకంటె సౌఖ్యసంధాయకమని కాఁబోలు ప్రభుత్వాధికారుల తలంపు. ఆ తలంపే వారికిఁ దలవంపు గారణమైనది. కుటీరావాసమున కలవడిన యబల దుర్భర కారావాసమున నెన్ని సౌకర్యము లుండినను దీవ్రామయపీడనమునఁ దనివొందునా? ప్రశాంత వాతావరణమున కాలవాలమైన సేవాగ్రామ కుటీరవాసమేడ? కఠిన శిలానిర్మితము కారాగృహమేడ? స్వచ్ఛ సౌరభమును వెదజల్లు పూదండ యేడ? కాలుసేతులు బిగియించు బంగారు సంకెల యేడ? సువర్ణ నిర్మిత మిదియని శృంఖలఁ గోరువా రెవరు? ప్రభుత్వపు బులిబూచికపుపలుకులు యథార్థములు

గావనియు నా తరుణమున నామెకు కారాగారము నివాస యోగ్యము గాదనియే గాని దేశ స్వాతంత్ర్యసంపాదమున కెట్టి కష్టములకైన నిష్టపడదనికాదు.

అరెస్టు గావింపఁబడిన పిమ్మట మొదటి పర్యాయము బొంబాయి ప్రభుత్వము వారామె యనారోగ్యము గూర్చి 1943 మార్చి 19 వ తారీఖునఁ బ్రచురించిన ప్రకటన మందిటులున్నది :

"వారములో రెండు పర్యాయములు తీవ్రమగు గుండె జబ్బు. ఇప్పుడాజబ్బు నెమ్మదించినది. ఆరోగ్యము నామె తిరిగి పొందుచున్నది. ఆ యీడునందు సాధారణముగ నుండ వలసిన స్థితియందున్నది. ఆమెకు డాక్టరు గిల్డరు, బి. జిడ్. షా యను నిపుణులగు భిషజ్ఞులు పరిచర్యలు సేయు చున్నారు".

ఈ యధికారప్రకటనము ప్రజల కామె యారోగ్యము గూర్చి యాందోళనము నుడిపినది.

డిశెంబరు 4 వ తేదీన మఱల నామె యారోగ్యముఁ గూర్చి ప్రభుత్వమొక యాధికారిక ప్రకటనము గావించెను. అందు ఆ వారమున మఱి రెండు పర్యాయములు హృద్రోగము కలిగెననియు, దుర్బలస్థితి యందుండుటచే నామెను చూచిపోవుట కామె పుత్రులు పౌత్రులు ననుమతింపఁబడి రనియు నందుండెను. ఈ ప్రకటనము కస్తూరిబాయి యారోగ్యముఁ గూర్చి ప్రజల కనుమానము గలిగించెను.

రోజులు గడచుకొలది, ఆమెస్థితి విషమించుచున్న వార్తలు కారాగృహ కుడ్యములనైతము భేదించుకొని వెలికి

వచ్చుచుండెను. ఆమెను విడిపింపుడని ప్రజలు ప్రభుత్వము నకు విజ్ఞప్తులు సేయుట యధికమయ్యెను.

ప్రభువుల సభలో డిశెంబరు 15 వ తేదీనాఁడు స్ట్రాబోల్జి ప్రభువు "భారత ప్రభుత్వమునకు కస్తూరిబాయిని విడుదలఁ జేయు నుద్దేశముగలదా ?" యని ప్రశ్నింపఁగా, ఇండియా కండర్ సెక్రటరీ, మున్సటరు ప్రభువు ఇట్లు ప్రత్యుత్తరించెను. "భారత ప్రభుత్వము కొంతకాలము ఆమె విడుదలఁ గూర్చి యాలోచించి, తుదకొక నిర్ణయమునకు వచ్చినది. నేఁటికి నానిర్ణయమునే యంటిపెట్టుకొని యున్నది. అదియేమన: ఆమె యారోగ్య దృష్ట్యా యామె జైలునందుండుటయే శ్రేయస్కరము. కారణమేమన: ఆమె నుపచరించుచు భారతీయ వైద్యులందు హృద్రోగ నివారణమున కందెవేసిన సుప్రసిద్ధ వైద్య శేఖరులున్నారు. ఇప్పుడప్పుడనక నెల్లప్పుడు వారామె విషయమున శ్రద్ధవహించుచున్నారు."

ఇదే ప్రశ్న కామన్సు సభలోఁగూడ మఱునాఁడు వేయఁబడెను. స్టేటుకార్యదర్శి అమెరీగారు నదేసమాధాన మిడియెను. "ఆమె విడుదల కాఁగోరినచో విడుదల యగుటకు ప్రభుత్వము సమ్మతించునా? అట్టి యవకాశ మామెకిత్తురా?" అని మఱల ప్రశ్నరాఁగా "ఆమె కన్ని సౌకర్యములు కల్పింపఁ బడినవి. ఆమెకు కారాగారవాసము సర్వవిధముల సముచితము" అని సమాధానము. "ప్రభుత్వము వారి యౌదార్యము నభినందించుచున్నాముగాని వైద్యులుగాని యామెగాని ఆ విడుదల యవసరమని యభిలషించునెడల నట్టి యవకాశముండునా ?" యని పునఃప్రశ్న. "ప్రభుత్వమే తన యిచ్ఛవచ్చిన

తెలుఁగునఁ జేయును. ఆ విషయమున నేనేమియుఁ జెప్పఁ జాలను.”

డిశెంబరు 20 వ తేదీనాఁడు బొంబాయి గవర్నమెంటు వారొక యాధికారిక ప్రకటనము గావించెను. అందామెకు మఱల ప్రమాదకరమైన గుండెజబ్బు వచ్చెననియు సహజ దౌర్బల్యము వయస్సు అనువానిదృష్ట్యా ఆ జబ్బు మిగుల నాందోళనకరమనియుఁగలదు.

1943 డిశెంబరు 24 వ తేదీ నాఁడు భారత ప్రభుత్వ మొక ప్రెస్సునోటులో నిట్లు తెలిపెను. “ప్రస్తుతానారోగ్య పరిస్థితి ననుసరించి గాంధీసతీమణి యనుభవించుచున్న సుదీర్ఘ కారాగారవాసముఁ గూర్చిన పెక్కు పత్రికా విమర్శలను ప్రభుత్వమువారు గమనించిరి. ఆమెను విడుదలజేయుటమూల మున నామెను తన పతినుండి వేఱుచేయవలసి వచ్చును. ఇప్పుడామె భర్తృ సాహచర్యమును బొందుటయేగాక వైద్య సహాయము పూర్తిగాఁ బొందఁగలదు. ప్రస్తుతము పొందు చున్నదిగూడ. ఆమెను జూడవచ్చు సన్నిహితబంధువుల కెట్టి విరోధములేదు. ప్రభుత్వమువారామెను ఆగాఖాను భవనము నుండి మఱియొక చోటికంపుట యామె యెడఁగాని యామె బంధుగులయెడఁగాని దయచూపుట యనిపించుకొనదని నిశ్చి తాభిప్రాయులై యున్నారు.

1944 జనవరి 4 వ తేదీనాఁడు దేవదాసు గాంధీ తన తల్లిని దర్శించి డర్బనులోనున్న సోదరుఁడగు మణిలాలునకిట్లు వార్త నందించెను: “తల్లిస్థితి పూర్తిగ విషమించినది. వైద్య మున ప్రయోజన మత్యల్పము.”

1944 ఫిబ్రవరి 1 వ తారీఖున బొంబాయి ప్రభుత్వాఫీ కార ప్రకటనమునఁ దత్పూర్వదినమునఁ గస్తూరిబాయికి హృద్రోగమతితీవ్రముగ సుభవించెననియు నామె మిక్కిలి దుర్బలయై యుండెననియు నుండెను.

ప్రభుత్వ ప్రకటన మట్లుంచి, ఆమె కత్యంతము ప్రేమాస్పదుఁడగు కుమారుఁడు శ్రీ దేవదాస్ గాంధీ ఫిబ్రవరి 28 వ తేదీన నిట్లు పలికెను :

"1942 సెప్టెంబరు నెలలో కారాగృహముననుండఁగనే యామెకు మొట్టమొదట హృద్రోగ లక్షణములు గోచరించినవి. అంతకుఁ బూర్వము ఐదు సంవత్సరములుగా స్వస్థత లేకున్నను, ఈ జబ్బుమాత్రమామెకు లేదు. 1942 సెప్టెంబరు నెలలోఁ గలిగినయామయము నయముకాలేదు.

కారాగారవాస దుస్థితి నామెకు దైహిక మానసిక కార్శ్యముఁగూర్చెననుటయం దెట్టి యతిశయోక్తియు లేదు. రాజకోటలో నేకాంతముగ నిర్బంధ మనుభవించినసందర్భమే యామె యారోగ్యమును శిథిల మొనర్చినది; ఈతుది కారాగారవాసము పూర్తిగ దేహమును జీవశక్తిని కృశింపఁ జేసినది. భవన పరిసర వాతావరణముల కామె యలవడియుండలేదు. ముండ్లతీగల కంచెకట్లు, రక్షకభటులు అనిష్టములగు దృశ్యములు. సేవాగ్రామమునందలి చిన్న చిన్న కుటీరములలో నివసించుటకేకలేదు కాఁబోలునని లోలోపల దుఃఖించెనని చెప్పుటమూలమున మాతల్లిగారి యాత్మకు ద్రోహముచేసిన వాఁడనుకాను.

విమోచనము విషయము నిర్ణయముగాని కారాగృహ శిక్ష యామెను క్రుంగఁదీసినది. ప్రభుత్వము వారొనరించు సౌకర్యములెన్నియేని యామెకు మనశ్శాంతి నొసఁగఁజాలవు. వేలకొలది ప్రజలు, తనకు బాగుగఁదెలిసిన వారెందఱో తానను భవించు కారాగార శిక్షవంటిది యనుభవించుచున్న వారనుట యామెకు దుర్భరమయ్యెను. ఇతరులకు విడుదల యొసఁగి యవసరమైన నన్నును నా భర్తను శాశ్వత శిక్ష కూర్చుమని యామె దేవుని ప్రార్థించెను.

తీవ్రములైన తుది రోగలక్షణములలో కారాగృహ విముక్తి సంభవించిన యెడల నామెకు నారోగ్యముకలిగి యుండెడిదా ? యనునది యాలోచనీయము. తిరిగి కారా గృహామునకు వచ్చునవకాశముగూడ నామెకున్నచో నామె కుపకరించి యుండెడిది. అది యథార్థమగు కరుణ యనిపించు కొనును.

విడుదలయగునను భావమైనను నామెకు మానసిక శాంతినిగూర్చి యుండెడిది. తుదకామెకు భగవంతుఁ డొసఁ గిన విముక్తితప్ప మఱియొండు లభింపలేదుగదా !"

కస్తూరిబాయి విడుదలగూర్చి ప్రభుత్వ హృదయమును ద్రవీభవించుటకు ఫిబ్రవరి 8 వ తేదీనాఁడు తుదియత్నము జరిగెను. కేంద్ర శాసనసభలో గోవింద దేశముఖ్ ప్రశ్నిం చెను గాని హోమ్‌మెంబరు డిశెంబరు 24 వ తేదీనాఁటి ప్రెస్సు నోటునే పేర్కొని యూరుకొనెను. "తీవ్రామయ పీడితులై యున్న సందర్భమునందుఁగూడ, బంధితుల విడుదల సేయఁ గూడదని ప్రభుత్వమువారి యభిమతమా ?" అని హోం

మెంబరును ప్రశ్నింపఁగా ఆరోగ్యముఁ గోల్పోవుటచే శ్రీమతి సరోజినీనాయుడు విడుదల యయిన సందర్భము దృష్టాంతీక రించెను.

19 రోజులు పిమ్మట ఫిబ్రవరి 20 వ తేదీనాఁడు బొంబాయి ప్రభుత్వాధికారిక ప్రకటన మిట్లుండెను. "శ్రీమతి కస్తూరిబాయి గడచిన కొన్ని దినములనుండి క్షీణించుచున్నది. ఇప్పు డామెపరిస్థితి పూర్తిగ ప్రమాదముగ నున్నది." మఱు నాఁడు గూడ నామె పరిస్థితి యట్లేయుండెను. కలకత్తానుండి పూనాకు పెన్సిలిన్ విమానముమీఁద సత్వరముగ దెప్పింపఁ బడుచున్నదియని ప్రభుత్వము ప్రకటించినది.

## 11. అంతిమ క్షణములు

దేవదాసు తనతల్లి యంతిమ క్షణము లత్యంత విపులముగా 28 వ తేదీనాఁడు వర్ణించెను. "తుదిక్షణముదనుక నామెకు స్మృతి తొలఁగలేదు. ఫిబ్రవరి 20 వ తేదీనాఁడు ప్రమాదకరముగ నున్నదియని యామెస్థితిని వెల్లడించునప్పటి కింకను ఆమె జీవితాశతో మృత్యువుతోఁ బెనగులాడుచునేయున్నది. గుండె నీరసముగఁ గొట్టుకొనుటతో మూత్రపిండములు పని చేయ మానినవి. ఈదుస్థితికి జ్వరములేని నిమోనియా తోడైనది. రక్తపు టొత్తిడి తగ్గినది. వైద్యులు తమ యత్నములకుఁ దిలోదకములు వదలిరి. సోమవారము సాయంసమయమునకు నేను వెళ్ళునప్పటి కామె మిగుల కష్టమున నుండెను. ఆమె యందు భక్తిశ్రద్ధలుగల తోడి బందీలామె నాయికొట్టు నుండి యుద్ధరింప మిగిలినది. వైద్యు లెప్పుడో మరణించునని తలఁచిరి కాని యారాత్రి నామె గడపెను. ఈప్రపంచమున నామె కదియే తుదిరాత్రి. ఆరాత్రి ప్రతిసెకండు ఆమె సహచరులును గాంధీగారి యనుచరులును పరిచర్యలుసేయుచు నుండిరి. అర్ధస్మృతి దశలో వారడుగుదానికి ఊకొట్టుటయో నొగుగుటయో చేసైఁగ జేయుటయో చేయుచుండెడిది. ఒకప్పుడు గాంధీజీ ఆమె యొద్దకు వచ్చుటఁజూచి యామె తన చేయియెత్తి 'ఎవరది' యని యడిగెను. అతఁడని గుర్తించి, యతఁడొనర్చు సపర్య లొక గంటకుఁబైగా గ్రహించి, అత్యంతానందము ననునయము పొందెను. ఆమె పార్శ్వమునఁ గూర్చుండిన యతఁ డామెకంటె నెంతయో చిన్నవాఁడుగఁ దోచెను. దక్షిణాఫ్రికాలో సుమారు 32 సంవత్సరములకుఁ

బూర్వము మూఁడు నెలలు కారాగారశిక్ష ననుభవించి వెలికి వచ్చిన మాయమ్మ చిక్కి శల్యావశిష్టయై యుండెనుఁ. అప్పు డొక యైరోపీయ మిత్రుఁడు ఒక రైల్వేస్టేషనుకడ మాతల్లి దండ్రులఁ జూచి మా తండ్రితో నిట్లనియెను: "గాంధీగారూ, ఈమె మీతల్లియా ?" ఈసంఘటన మిప్పట్టున స్మృతిపథమునఁ దొలఁగక యున్నది. ఉదయమున నామెకు జబ్బు అధికముగ నుండెను గాని చూచుట కొకింత ప్రశాంతముగ నుండెను. సోమవారమున నొకింత యాశ వహించియుండెను. మంగళవారమునాఁడు ఆత్మసమర్పణబుద్ధి నుండెను. రక్తసమ్మిశ్రణ మూత్రవ్యాధి లక్షణము లతి తీవ్రములుగ నున్నను నామె మానసము నిర్మలముగను ప్రశాంతముగను నుండెను. మందును, నీటినిగూడ సోమవారమునుండి పుచ్చుకొన నిరాకరించెను. మంగళవారపు మధ్యాహ్న కాలమున భాగీరథీ పవిత్ర జలము కొఱకు నోరు తెఱచెను. అది యామె కొకింత తృప్తి కలిగించెను. సాయంకాలము సుమారు 3 గంటలకు నన్నామె పిలిపించి తన నిర్గమనముఁగూర్చి తెలిపెను. మఱియు నామె నాతో నిట్లు వాదించెను: "ఏదోయొక దినమునఁ బోక తప్పదుగదా ? ఆదిన మీదినమేలకారాదు?" ఆమె కనిష్ఠపుత్రుఁడనగు నేనామెను పట్టుకొని యుంటిని. ఈపలుకుల తోడనే యిట్టి తఱి మఱికొన్ని తీపి తేనియలొలుకు పలుకుల తోడనే యామె నాచేతులలోనే ప్రాణముల వీడెను. ఆమె కంఠధ్వని యింత విస్పష్టముగను ఆమె పలుకు లింత యుక్తియుక్తములుగను నెన్నఁ డింతకుమున్నుండలేదు. ఈవిధముగ నాతోఁబల్కిన కొంతసేపటికిఁ దటాలున నామె స్వాయముగ

లేచి చేతులుజోడించి సాధ్యమైనంత బిగ్గరగా దైవము నిట్లు ప్రార్థించెను.

"ఆర్తశరణ్యా, స్వామీ, తమ దయను వాంఛించుచున్నాను" నేను నాకన్నీటిని దుడిచివైచికొనుటకు వెలికిఁ బోవునప్పటికి, ఆగాఖాను భవనపు వరండాలోనికి పెన్సిలిన్ వచ్చియుండెను. వైద్యులకా చికిత్సచేయుట యిష్టములేదు. ఈ చికిత్సవలన నిమోనియా యొకటియే నయమగునది. మూత్రపిండముల వ్యాధి నిది కుదుర్పజాలదు. అదియుఁగాక నిప్పటికే చాలకాలము గతించినది. అయినను, ఈ యద్భుతౌషధము యంత్రములచే సిద్ధపరపఁబడినది. సుమారు 5 గంటలకు నేను ధైర్యము వహించి మాతల్లిని దర్శించితిని. ఆమె నన్నుజూచి చిఱునవ్వునవ్వెను. 43 యేండ్లుగ నన్ను బుజ్జగించుచున్నదియే యానవ్వు. అయినను మరణింపనున్న తల్లి విచారముతోఁ దనతనయుని ఓదార్చుచున్నటులున్నది. ఆమె సహజముగ మానవ సహజానురాగము తీవ్రముగ గలది. ఆమె నాయందందఱికంటెఁ జూపు నధికానురాగమునకు నామె పక్షమున నేనితరుల మన్నింపవేడెదను. తన సృష్టికిఁ దేజ మొసఁగు దేవుడు అల్పలోపములఁ దప్పక క్షమించును. ఈ చిఱునవ్వు పెన్సిలును యత్నింప వలయునను కుతూహలమును రేకెత్తించినది. వైద్యులతో సంప్రదించుట నాధర్మమని తలంచితిని. వారు దానిని యత్నింప నిష్టడిరి కాని ప్రయోజన ముండదనియుఁ బలికిరి.

బాపూజీకి నేను నాయమ్మకు ఇంజెక్షను నిచ్చుటకు అంగీకరించితినని తెలిసి, నాతో నీ విషయమును చర్చించుటకు

తన సాయంకాలపు నడకను విడిచివచ్చెను. అతడు నాతో, "ఇపుడు నీతల్లికినీవెట్టి యద్భుతౌషధముల తెప్పించి యిచ్చినను ప్రయోజనములేదు. నీవు పట్టుపట్టినచో నొప్పుకొందును గాని నీవు పొరఁబడుచున్నావనక తప్పదు. ఈరెండు రోజులు ఆమె ఔషధమును నీటిని నిరాకరించినదిగదా. ఆమె యిప్పుడు దేవుని చేతులందున్నది. ఇప్పుడు నీవవలంబించు విధానము నకు వ్యతిరేకముగ సలహాచెప్పుచున్నాను. చనిపోవుచున్న జననికి మైదారు గంటలకొక పర్యాయము భౌతికమగు బాధ కలిగింపఁ దలఁచుచున్నావు" అనెను.

ఇఁక నాయనతో వాదించుట నాపనిగాదు. వైద్యులకీ వృత్తాంతమువలన సౌలభ్యము గలిగెను. మాతండ్రితో నిట్టి మృదుమధుర వాగ్వివాదము ఇంతకుఁ బూర్వమెన్నఁడును సంభవింపలేదు. ఇది పూర్తియగుచుండఁగనే మాతల్లియొద్ద నుండి బాపూజీని తనకడకు రమ్మని కబురువచ్చినది. వెంటనే యతఁడచ్చోటికేఁబోయి యామెను దనభుజముపై వ్రాల్చుకొని కూర్చుండెను. అతఁడా సమయమున నామెకు వీలైనంత స్వాస్థ్యము నొసఁగయత్నించెను. ఆమెను పరిశీలించుచు నెదుట నిలువఁబడియుంటిని. నావెంటఁ బదుగు రితరులుండిరి. ఆమె ముఖముపై ఛాయయొకటి సాంద్రముగ వ్యాపింపఁ జొచ్చెను. ఇంకను స్వాస్థ్యము నభిలషించి చేయియూపుచు నామె మాటాడఁ జొచ్చినది."

మహాత్ముఁడుగాక అతని యిరువురు పుత్రులు హీరలాలు, దేవదాసులును, డాక్టరు సుశీలనాయరు, ప్యారిలాలు,

ప్రభావతీదేవి (జయప్రకాశ నారాయణుని సతి), డాక్టరు గిల్డరు, కానూగాంధీ, ఆనందస్వామి యనువారలును అగది యందు గుమిగూడిరి. మహాత్ముని బంధువు లొక కొందరు గూడ హాజరైరి. చిట్టచివఱ కుద్వేగముతో గదిలోని కురికిన వాఁడు కస్తూరిబాయి యేకైకాగ్రజుఁడు మాధవదాసు గోకుల్దాసు.

ఆమె యంత్యమును వర్ణించుచున్నాఁడు కనిష్ఠ పుత్రుఁడు.

'కనుఱెప్ప పాటులోఁ గనుమూసిన దామె. అచట నున్నవారి కనులు చెమ్మగిలినవి. బొప్పములు చెక్కిళ్ళపై కి జాఱినవి. నాజనకుఁడు మాత్రము పొంగిపొరలివచ్చు కన్నీటి జాలును నిరోధించెను. ఉన్నవారెల్ల నర్ధచంద్రాకృతిలో నిలువఁబడి, మా యమ్మ జీవించి యున్నప్పుడామెతోఁగలిసి పాడు ప్రార్థన గేయము నామె కత్యంత ప్రియమగు దానిని బాడిరి. రెండు నిమిషములలో నామె కొయ్యవాఱెను. అచట నున్న యొకరన్నట్లామె మేము భోజనముచేయుట కవకాశ మిచ్చెను. కారాగృహమునఁ దుది భోజనము సుమారు సాయంతన మూఁడు గంటలకుఁ జేసితిమి. 7.35 ల కామె మముపీడి దివి కేగెను.

అది పుణ్యప్రదమగు మహాశివరాత్రి. బొంబాయి ప్రభుత్వము వారీ విషాదవార్తను ప్రపంచమునకు ఫిబ్రవరి 22 వ తారీకున నావిష్కరించిరి.

'బొంబాయి ప్రభుత్వమువారు గాంధీగారి సతీమణి కస్తూరిబాయి సాయంకాలము 7.35 లకు నేడు పూనాలోని ఆగాఖాను భవనమునఁ జనిపోయెనను వార్తను విషాదముతో దెలుపుచున్నారు.'

# 12. దహన సంస్కారము

కారాగృహములపై నధికారముగల ఇన్‌స్పెక్టరుజనరలు భండారీ యనునతఁడు సాయంకాలము 6.35 లకు భవనమును పర్యవేక్షించి, మరల 7.30 లకు వచ్చి, రాత్రి 11 గంటలవరకు నచ్చటనే యుండెను. ప్రేమలీల ఠాకర్సే యను నామెయు, శాంతికుమార్ మొరార్జియు నంతదనుక కారావాసమునఁ గస్తూరిబాయి శవముకడ నుండ ననుమతివడసిరి.

23 వ తేదీనాఁడుదయము 10.40 నిమిషములకు కస్తూరిబాయి కాయమునకు దహన సంస్కారము జరిగెను. ఆమె యంత్యక్రియలు ఆమె గారాబు కడగొట్టు కొడుకు దేవదాసు జరిపెను. గాంధీగారి బంధుమిత్రులు శతాధికముగా నీ సంస్కారక్రియ నవలోకింపవచ్చిరి.

తెల్లని ఖద్దరు చీరెధరించి, నారింజవర్ణముగల ఖద్దరు వస్త్రముతో గప్పఁబడిన ఫాలతలమున గుంకుమశోభలతో నామె హాయిగ నిద్రించుచున్నదాయనునట్లు తోచుచుండెను. పుష్పాలంకృతమైన వాహికపై నుంచి దానిని పుత్రులును బంధువులును భవనమునకు నూరుగజములు దూరముననున్న శ్మశానవాటికకుఁ గొంపోయిరి.

కీర్తిశేషుఁడైన మహాదేవదేశాయి కంత్యక్రియలు జరిపించిన పురోహిత బ్రాహ్మణుఁడే యీామెకు నంత్యక్రియలు జరిగింప వచ్చెను. ఈ వైదికక్రియ నిరాడంబరముగా స్వల్పకాలములో జరిగెను.

ఆనందస్వామియు, మహాత్ముని కగ్రజ పౌత్రుఁడు కాన్హా గాంధీయును, కమలనారాయణబజాజు ప్రభృతులగు మిత్రులును చితిని పేర్చిరి.

కస్తూరిబాయిశరీరము చితిపై నుంపఁబడుచుండఁజూచి గాంధీజీ దుఃఖము నాపుకోఁజాలక యందఱి యెదుటనే వస్త్రముతోఁ గ్రమ్మిన బాష్పబిందువులఁ దుడిచికొనెను. ఈయొక సందర్భమునందప్ప నతఁ డింక నెప్పుడును భావావేశ వివశుఁడు కాలేదు. ఈ కార్యక్రమ మంతయు జరుగుచుండ నతఁడు మౌనము ధరించియుండెను.

దహన క్రియకుఁ బూర్వము జరుగవలసిన వన్నియు జరిగినపిమ్మట, గాంధీజీ సైగ జేసి పురోహితుని యనుమతితోఁ దానొకింత ప్రార్థన జరుపఁగోరెను. కొరాను, భగవద్గీత, బైబిలులోని యంశములు కొన్ని పఠింపఁబడెను. ఆశ్రమ సభ్యులు భజన గావించిరి. డాక్టరు యం. డి. డి. గిల్డరు జొరాష్ట్రియను మతగ్రంథ భాగములఁ గొన్ని పఠించెను. మీరాబెను ఒక భక్తిగీతమును బాడెను.

ప్రార్థన కార్యక్రమము ముగియుటతోడనే, పురోహితుని మిగిలిన కర్మకలాపమును బూర్తిచేయఁగోరెను. అవి జరుగుచుండ నతఁడు తనయూత కఱ్ఱపై నానుకొని నిలువఁబడెను. మంచిగంధపు చెక్కలు ఆమె శరీరముపైఁ బేర్చిరి; ఘృతముతో వాని నెల్లఁ జక్కగాఁదడిపిరి. దేవదాసు కొఱవిని జేఁబూని చితికి ముమ్మారు ప్రదక్షిణముగావించి, 'గోవింద, గోవింద' యను ధ్వనులు పెల్లుఱేఁగ చితి కంటించెను.

# 13. సంచయనము

కస్తూరిబాయి భస్మమునకు సంచయనము ఆగాఖాను భవనమున ఫిబ్రవరి 25 వ తేదీనాఁడు జరుపఁబడెను. గాంధీజీయును, అతని పుత్రులు హీరలాల్, రామదాసు, దేవదాసులును, ఇంకను నా భవనములోని వారెల్లరును ఈ సందర్భమున హాజరైరి.

దేవదాసు ఇట్లు వ్రాసెను: "నేనిప్పుడలహాబాదు (ప్రయాగ) నకుఁబోవుచు మార్గమధ్యముననున్నాను. నా వెంట నా మాతృదేవి యవశేషములున్నవి. వానిని సోమవారమునాఁడు గంగయందు విలీనము గావించెదను. ఇవి చితాభస్మమునుండి యచటి వారివలనఁ బ్రోగుచేయఁబడినవి. అంతట నవి యరటియాకుపై నుంపఁబడినవి. పూలు, పసుపు, కుంకుమ మున్నగు ద్రవ్యములతోఁ జక్కగా వానిని పూజించి వానికిఁ దుదియాత్రకు సిద్ధముచేయఁబడినవి. ఇట్లు నేను నాజనయిత్రితోఁ గలిసి పయనించుచున్నాను. ఈ కర్మకలాపము పూర్తియైన పిమ్మట నిఁక నాతల్లితోఁ బయనింపఁజాలనని నాకుఁదెలియును. రెండు మహానదుల సంగమ స్థానమున వీనిని విడువవలయునని గాంధీజీయొక్క విశదాభిప్రాయము. 'కోట్లకొలది హిందువులు గావించు విధానమే మీతల్లికిఁ బ్రీతినొదవించును,' అని యతఁడు తెలిపెను. ఈ నిశ్చయమును పండిత మదనమోహన మాలవ్యా పంపిన తంతివార్త దృఢపఱచెను. ఈ చితాభస్మరాశి, ఆచారానుసారము పూనా సమీపమున నింద్రాయణీనది యందు నిక్షిప్తము గావింపఁబడినది. నాకును నా వెంటనున్న కొందఱు

మిత్రులకును పవిత్రమై యాత్మోత్తేజకరమై విలసిల్లినది. చితాభస్మ మొకింత రెండవసారిఁ ప్రోఁగుచేసి కారాగృహమున భద్రపరుపఁబడెను. వీనిలో చితియందుఁ జేర్పఁబడిన మైదు చేతిగాజులు (లోహనిర్మితములుగానివి) పగులక చెదరక యథారీతిగ లభించినవి.

మా తండ్రి యీ యాపద నెట్లు సహించెనో కొలఁదిగఁ దెలుపుట నాకు విధ్యుక్తము. అతఁడొకింత కృశించియుండుట యెల్లఱకు స్పష్టము. తన జీవితమున సంభవించిన ఈ లోటునుగూర్చి యతఁడు వాపోవును. కారణ మేమన నేఁడతఁడు పొందిన గొత్ప్రతనమున కామెయే యనేకవిధముల కారణము. అతఁడు మహాత్ముఁడగుటచే తన భావోద్రేకముల నడఁచికొని వైరాగ్యముతో మౌనము వహింపఁ గలిగెను. అంధకారమయముగాని విచారముతోఁగూడిన వాతావరణ మతని చుట్టునుగలదు. నేను శుక్రవారము నాఁడాయన కడ సెలవుగైకొను సందర్భమునఁ గన్నీటికి బదులు సహజములు వాత్సల్యపూరితములునగు హాస్యప్రసంగములే యాతఁడు గావించెను. ఆయన యారోగ్యము యథారీతిగనున్నదనియే నా విశ్వాసము.”

## 14. శ్రద్ధాంజలి-యావద్భారత దేశము

కస్తూరిబాయి మరణవార్త చేరినవెంటనే, యనేక గ్రామము లందును, పట్టణములందును యావద్భారత దేశమున హర్తాలు జరుపఁబడెను. బహిరంగ సమావేశములందామె స్మృతిని పురస్కరించుకొని సంతాపతీర్మానములు చేయఁబడెను. పురపాలక సంఘములు, స్థానిక సంస్థలు, వాణిజ్య వ్యవస్థలు, ఇతర ప్రజాసంస్థలు నెన్నియో యామెగావించిన దేశసేవను ప్రశంసించుచు యామెకు జోహారులు సమర్పించినవి. విద్యాశాలలు చాలవఱకు మూయబడినవి. అట్లు సెలవీయని పక్షమున, విద్యార్థులు రా నిరాకరించుటచే, నాసంస్థల నాఁటికార్యక్రమమాఁగి పోయినది. బహిరంగసభలు, ఊరేగింపులు జరుపుటకు సలిపిన యత్నములకు ఫలముగా ననేక స్థలములం దసంఖ్యాక వ్యక్తులు డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సుక్రింద నరెస్టుగావింపఁబడిరి.

స్టేట్ కౌన్సిలు, బెంగాలు, పంజాబు, సింధు, ఒరిస్సా, ఫ్రాంటియర్ లెజిస్లేటివ్ అసెంబ్లీలు, సానుభూతి తీర్మానములు గావించి, శ్రీమతి కస్తూరిబాయి స్మారకసభలు గౌరవపురస్సరముగ జరుపుకొనిరి. సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీయందు మాత్రము, అధ్యక్షుఁడు కస్తూరిబాయి స్మృతి సంబంధములగు తీర్మానములు గావింప నంగీకరింపలేదు. అందులకతఁడు తెలిపిన కారణమేమనఁగా, అసెంబ్లీ సభ్యుల గౌరవార్థమట్టి తీర్మానములు జరుపుట అసెంబ్లీ సంప్రదాయముగాని యితరుల విషయమున మాత్రముకాదు.

కస్తూరిబాయి జ్ఞాపకార్థము బొంబాయి మునిసిపల్ కార్పొరేషనువారు తమ కార్యాలయమును మూసిరి. తత్సంతర్భమున యం. ఆర్. మసాని యను నా కార్పొరేషను మేయరు ఇట్లు నుడివెను:

"కస్తూరిబాయి ప్రారంభమున రాజకీయోద్యమమునఁ బనిచేసినదిగాకున్నను దేశదాస్య విమోచనము నిమిత్తము కృషిచేసిన భర్త జీవితమున భాగస్వామినియై నిరంతరము పరిశ్రమించినది. ఆమె జైలులోఁ జనిపోయెనను విషయము మన మింకను విదేశ ప్రభుత్వమున నస్వతంత్రులమై యున్నామనుటను గుర్తుసేయుచున్నది. శ్రీమతి కస్తూరిబాయి గొప్పతనము సంపూర్ణమైన యాత్మత్యాగమునందే యున్నది. ఆమె మృతి అరువది సంవత్సరములకుఁబైఁగా సహధర్మచారిణియై యుండుటచే మహాత్మునికిఁ దీఱరానినష్టముగావచ్చును, కారాగృహబద్ధుఁడై యుండుటచే నామెలేని కొఱత అమ్మహనీయున కణఁచరాని వేదన కాకరముగావచ్చును. ఇట్టి యావేదన మతని కొక్కనికేగాక యామెయం దత్యంతము గౌరవముగల దేశీయ నరనారీజనమున కెల్ల వేదనాజనక మనుట నిస్సంశయము.

గాంధీ సతీమణి మరణమునకు విషాదసాగరమున మునిఁగియున్న ప్రజానీకము తన దుఃఖచిహ్నముగ నేదేని శాశ్వతకృతి నొనర్చుట లెస్స. కార్పొరేషను పక్షమున మోతీచంద్ కపాడియా యనునతఁడు తీర్మానమును ప్రతిపాదించుఁగాత."

పండిత మదన మోహన మాలవ్యాగారొనర్చిన విజ్ఞప్తి ననుసరించి ఆదివారము మార్చి యైదవ తేదీ కస్తూరిబాయి స్మారకదినముగ దేశమంతట గ్రహింపఁబడెను. బహిరంగ సభలు జరుపఁబడెను. ఆమెయాత్మకు శాంతి గలుగుఁగాత మని ప్రార్థనలు జరుపబడెను. ఆమె దేశమునకుఁ గావించిన అసంఖ్యాకములైన సేవలకుఁ గృతజ్ఞతాపూర్వకములగు శ్రద్ధాంజలులు సమర్పింపఁబడెను.

# 15. నాయక ప్రాతినిధ్య నిర్వహణము

భారతభూమి స్వాతంత్ర్య సమర సంరంభమునఁ బరిభ్రమించు చున్న కాలమది. గాంధీజీ యేకైక నాయకత్వమున నచంచల విశ్వాసముంచి కడగండ్లకు వెనుకంజవేయక కారాగృహములు జేరుచున్నారు కాంగ్రెసు వాదులు. బ్రిటిషు ప్రభుత్వము దిక్కుతోచక జాతీయనాయకుల యడుగుజాడలఁ బట్టు ప్రజానీకము నొక్కుమ్మడి భయభ్రాంతముఁ జేసి తద్దార్శ విముఖులఁ గావింపఁ బలుపాట్లు పడుచున్నది. రక్షకభట సందోహము రాక్షసకృత్యములకు నియుక్తములైనవి. రక్షోపీకులైనను సత్యాగ్రహము నెఱపిన సతీమతల్లులపై నిష్ఠుర దౌర్జన్య నియతిఁజూపిన పాపమున కొడిఁగట్టినవారుకారు. మిలటరీ దండును మెలతలపైకిఁ బంపిన మ్లేచ్ఛుఁడును నితః పూర్వ చరిత్రమున గోచరింపఁడు. నాగరకజాతులమని నాట్యమాడు శ్వేతజాతి పాలననూ యిట్టి దారుణకృత్యముల కొడిగట్టుట ? కటకటా, యీ యాడుకూయి నాలించియైన నన్య దేశజుల సంస్కృతి సభ్యతల నాహుతిగొను వైదేశికనీతి యంతరింపరాదా ?

జాతీయనాయకులు చరిత్ర ప్రసిద్ధములగు ఎఱవాడ మున్నగు స్థలములందలి కృష్ణజన్మస్థలములందు బద్ధులైరి. ఔరా ! కర్మబంధములు తొలఁగినను ప్రభుత్వ శృంఖలకుఁ జిక్కక తప్పినదికాదుగదా ఎంతటిమహాత్ములకైనను ? అస్వతంత్రమగు నికృష్టజీవనముకంటె పావనమైన కారాగృహమే మేలుకాదా ! ఇట్లు నిశ్చయించుకొని కారణపురుషుఁడగు గాంధీజీ కారాగార బద్ధుఁడైయుండ దేశీయుల హృదయ

దౌర్బల్యమును బోఁద్రోలి హృదయేశ్వరుని కార్యభారము వహించుట విధ్యుక్త ధర్మమని నమ్మిన యబలాశిరోమణి ధర్మపత్ని యనియు, సహధర్మచారిణి యనియు పిలువబడుట కెంతయు నర్హురాలు! అంతేకాదు! తత్పదములకు సార్థక్యము అట్టి సతీలలామలయందే యనుట కిసుమంతయేని సందియము లేదు.

అదియొక పర్ణశాల. కాదు కా దదియొక జీర్ణకుటీరము. నవసారికి సమీపస్థమగు మరోలి యను కుగ్రామ మందలిది. తెలతెలనారుచున్నది. బాలభానుఁడు తన యపరంజి కిరణములతోఁ బ్రాగ్దిశాగర్భమున నుద్భవించి యెంతో సేపు కాదు. చలికాలమగుటచే జనులు పెక్కురు తమ ముసుగులు తీయకయే ప్రాతర్మఖోచిత కృత్యములకుఁ గడంగుచున్నారు. కాంతుని బాసి భూకాంతను సేవింపఁబూనిన కాంతాశిరోమణి యల్లదే కస్తూరిబాయి. ఇపుడామె వృద్ధాంగన. భర్తృహృదయము గ్రహించి తద్ధర్మపత్నీత్వ సార్థక్యమునఁ బరిశ్రమించుచున్నది యహర్నిశ మాయిల్లాలు.

నాఁడొక తంతివార్త వచ్చినది. అది స్త్రీల యార్తనాదము. "మాతృశ్రీ మావెంట నుండవలెను. పట్టణ ప్రజల హృదయములందు జ్ఞానదీప్తిని ప్రజ్వలించుటకామెయే సమర్థురాలు. ఆమె యండగనుండినఁ గొండలు బెండులగును." ఆర్తనాదము నాలించి నాఁడు శ్రీకృష్ణుఁడు ద్రౌపది కక్షయ వస్త్రదానము గావింపలేదా! గజేంద్రుని యార్తి నడంపఁగాదే నాఁడు రమానాథుఁడు సిరికిం జెప్పక శంఖచక్రములఁ జేదోయిఁ బూనక యేపరివారంబును జీరక తుదకు

గనుత్నింపనైనఁ బన్నింపక బయలు వెడలినాఁడు. దైవాంశ దైనార నవతరించిన కస్తూరియు నా ర్తలగు తోడి యిల్లాండ్ర మొఱ చెవి సోకెనో లేదో తత్క్షణమ బర్సాదున కురుక నుద్యుక్త యైనది. తంతిచేసు నప్పటికామె తన యుదయ కృత్యముల నిర్వర్తించుకొని యొకింత వేడి జావను పుచ్చు కొనుటకుఁ బాత్రను చేఁబూనినది. అది పెదవులఁ జేరలేదు పూర్తిగా, వార్తవచ్చినది. ఆ పాత్ర నవలికిఁద్రోసి పయన మైనది. ఆగృహ యజమానురాలు మిస్ మిథూబెన్ పటిట్ అనునామె ముందుకువచ్చి యీ ప్రయాణమును వారించుచు నిటులన్నది:

"నీకు రక్తహీనత ప్రబలముగనున్నది. వైద్యుఁడు నిన్ను విశ్రాంతి గైకొనఁగోరెను. నీకు బదులుగ నేను బర్సాదున కేగెదను. నీవు వలదు. నీ యారోగ్యము చక్కగాలేదు."

కస్తూరిబాయి మృదుమధురభాషిణియు సహజకోమల స్వభావయు నయ్యును వాదమున లొంగునదికాదు. అనంగీ కార సూచకముగ తల నడ్డముగఁ ద్రిప్పుచు తన మూట ముల్లె లను సరిదికొనెను. ఆమె యిడిన సమాధానము చూడుఁడు.

"ఈ నాబిడ్డలను, ధైర్యసాహసములతో రక్షకభట నివహముల దౌర్జన్యము నెదిర్చిన ఈ నా బిడ్డలఁ జూడవలెను. వారికి నేనండగ నుండవలెను. ధైర్యస్థైర్యముల నినుమడింప వలయును. ఈనాడు బాపు వారియొద్ద నుండెడివాఁడు. అతఁ డిపుడు వెలుపలలేడు. అతఁడులేని లోపమును బూరించు భారము నాపైనున్నది."

సులభసుందరములును, విశదమధురములును నగు వాక్కులలో నొక సందేశమును ప్రకటించినది. అందు బర్నాదులోను పోలీసుల స్వాతంత్ర్యమును నిర్దాక్షిణ్య విమర్శకు గురిచేసినది. బర్నాను సత్యాగ్రహిణులకు నిరాలస్యముగఁ దాను వచ్చుచుంటినని యాశాజనకముగ వార్తయంపినది. తన సందేశమును పత్రికాప్రచురణమున కనుమతించినది. ఓనమాలు పూర్తిగరాని యువిద యెట్టులీ రాజకీయ వ్యవహారముల కనువగు భాషాపరిజ్ఞానమునఁ దేజరిలెనో. "వీణ బట్టుటకు నెఱనెఱుంగని కొమ్మ శారాసనంబెట్లు పట్టనేర్చె" అను నాశ్చర్యమును కలిగించినది కస్తూరిబాయి.

అనారోగ్య మేమూల డాగినదో, అశక్తత యేవీధి కేఁగినదో, అపూర్వశక్తిసామర్థ్యములతో ముందున కురుకుచున్నది డెందమమంద స్థైర్యమునకు నిదానముకాఁగాఁ గస్తూరిబాయి. వృద్ధాంగనయయ్యు లేఁగొదమసింగపుటాలు వోలెఁ జూపరుల కత్యాశ్చర్యానంద సంధాయిని యగుచున్నది. ఒక బర్నాదునకేకాదు. కైరామండలమందలి పల్లి పట్టణములకునెల్ల విసుగు విరామములేక గుర్రమ్మురఁ దోడఁ గినది. ఎన్నివిధములుగఁ బయనము సాధ్యమో యన్నివిధములఁ బయనించినది. నదీనదములకు వెఱువలేదు. కొండల పిండునుగని గోడువెట్టలేదు. ఇసుకయెడారులకు విసువనులేదు. పచ్చికబయళ్ళకు మచ్చరింపనులేదు. ఘోరారణ్యములకు కుదిల పడనులేదు. మొలబంటి బురదకు మొగము చిట్లింపనులేదు. "ఘోరారణ్యంబైన నేమి కూరిర దవానలమైన నేమి" యని నాఁడు పతినిమిత్తము జముని వెన్నాడిన సావిత్రి చరిత్ర

మును ఫలపించుచు భక్త్యకార్యవశంవదచిత్తమైన పరమ పావనచరిత దేశ సేవానిరత యైన దీ గరిత. మరోలీ కుటీరమున రాట్నమును త్రిప్పుచు మౌనమునఁ గాలమును బుచ్చునట్టి యబలకాదీమె. పత్రికాపఠనము గావించువారికిఁ జెవియొగ్గి వినుచు గృహకృత్యములుతప్ప నితరము నెఱుఁగని దనఁదగి యుండు తన్వంగి కాదీ యమేయగుణరాశి. ఎక్కడిదో యీ యమోఘ వాక్ఛక్తి. ఇంటింటికిఁ దిరుగుచున్నది. నిర్మాణ కార్యక్రమ ప్రాముఖ్యమునుగూర్చి నిరుపమాన ప్రసంగములఁ గావించుచున్నది. ఖద్దరునుగూర్చి యుపన్యసించుచో గాంధీజీ వైఖరి వేఱు. కస్తూరిబీపు వేఱు. కర్షకజనమధ్యమున నిలిచి క్రమవచోమృతవృష్టి గురియించు నామె వారికెల్లఁ దల్లియై యొప్పినది. మాతృదేవి సన్నిధానమున మక్కువమెయిఁ జక్కగ విద్దెలఁగఱచు కసికందులా యాకర్షకులు? ఆదృశ్యము, ఆకార్యపరత్వదీక్ష, యామాతృవాత్సల్యపరిప్లుత హృదయగాంభీర్యము మధుర దరహాస చంద్రికాసాంద్రమహిమోపేతము. వర్ణనాతీతము. చర్ఖానుగూర్చియు తత్పరిశ్రమావశ్యకతను గూర్చియు మృదుమధురవాక్యముల వెలువరించు నపుడొక యిష్టవస్తువును బాలురకుఁజూపి నోరూరించు నటు లుండెడిది. అరటిపండొలచి నోటి కందించిన తెఱఁగు దోపించెడి దామె వర్ణనాత్మక ప్రసంగము. భారతజాతి కేకైక నాయకుఁడైన యొకమహాత్మునికిఁ బ్రాతినిధ్యము వహించుటయా యొక వనితామణి. కాదు కాదొక మహానాయకునికిఁ బ్రాతినిధ్యము వహించుట—సుప్రసిద్ధ మహానాయకు లెందఱో కారాగృహబద్ధులై యున్నారు—వారికెల్ల నీయమయే ప్రాతిని

ధ్యము వహించెను. ఇందుఁగల దందులేదను సందియము దోపనీయక యెల్లయెడలఁ దానయై యెల్ల వ్యవహారముల యందుఁ దానయై యోర్పు మెయి నేర్పు మెయి మెలఁగఁ జొచ్చినది యాయువిద. సేనాని పట్టువడఁగా సేనాముఖమున నిలిచిన యొక యనామక యోధునిపై సంగ్రామ నిర్వహణ బాధ్యత పడినటు లీమెపై సత్యాగ్రహ సమర నిర్వహణభా రము పడినది. దానినామె హృదయపూర్వకముగ స్వీకరిం చినది.

బర్డోలునందామె యొనర్చిన కృషి యొకింత వర్ణ నార్హము. ఘోరామయ మే ఘోర కాననసీమ కరిగెనో దాని జాడయే లేదు. స్మృతిపథమునుండి యది ధృతి దొలఁగి పలా యన మంత్రము పఠించెనేమో! ఉదయాద్యస్తమయ పర్యంత మామె విశ్రాంతి యెఱుఁగక నాఁడు తిరుగుచునే యున్నది. స్థానిక జాతీయ నాయకులనెల్ల దర్శించి స్థితిగతులఁ బరామర్శిం చినది. తన యభిప్రాయముల వాగ్రూపములఁ బ్రదర్శించినది. వైద్యశాలలందుఁ జికిత్సలఁ బొందుచున్న వీరనారీమతల్లుల హృదయ పల్లవములకు సల్లాపోల్లాసము నొదవించినది. అను నయ పూర్వకోత్సాహము తడియారిన తద్హృదయలతల కొకింత పునఃప్రఫుల్లతను ప్రసాదించినది. ఇటులామె తన బాధ్యతను భారమును గుర్తించి వర్తించినది. ప్రత్యంశమును ప్రత్యణువును శ్రద్ధమెయి సువిమృష్టము నొనర్చి యప్రతీకార దీక్షాదక్షమగు నహింసా యజ్ఞ రూపకమైన యపూర్వ ప్రజా సమరమునకు నాయకురాలై వన్నె కెక్కుట మాటలతో నగు పనియా?

బర్నాసునందిట్లు ప్రజాప్రబోధాదిక సంగ్రామ సంరంభము సేవారూపమునఁ గావించి నాడియాడునకు వచ్చునప్పటి కామె యారోగ్యము తీవ్రముగ వక్రించినదనియు విశ్రాంతి యత్యంతావశ్యకమనియు వైద్యులెల్లరు సప్రమాణముగఁజెప్పి యొప్పించి యుద్యమ ముఖమునుండి వెనుకకంపఁబూనిరి కాని యామెకు వారి హితోక్తులు సమాదరణీయములయ్యెను సమాచరణీయములు కావయ్యెను. వారితో నిట్లు వాగ్వాదమునకుఁ బూనికొన్నది. తన యభిప్రాయము నిట్లు విస్పష్టము గావించినది. "నేఁటిదనుక నేను బాపూజీ ననుసరించి యతఁడేగు ప్రతిప్రదేశమునకుఁ బోవుటయేగాని యాపూజ్య మహాపురుషుని యుద్యమమునందుఁ బ్రత్యక్షముగ బాల్గొను భాగ్యము లభింపలేదు. దురదృష్టములో నదృష్టమన్నట్లు భర్తృవియోగము భర్తృసదుద్యమ సముద్యోగముగఁ బరిణమించుటయు యోగవిశేషమే. నేనీ యవకాశమును జాఱవిడువఁజాలను. విశ్రాంతియనుమాటను దలపెట్టఁజాలను. కర్తవ్య నిర్వహణమున మరణమైనను వాంఛనీయమే." ఔరా! ఏమి ధీర గంభీర వాక్ప్రవాహము! మాతా, ప్రపూతా, జోహారులు.

మహాత్ముఁడారంభించిన సత్యాగ్రహ స్వరూపము ప్రపంచము మున్నెన్నఁడు కనివినియెఱుఁగదు. శాసన తిరస్కార సత్యాగ్రహసమారంభ సంరంభము 1928 సంవత్సరమునను 1930 వ సంవత్సరమునను బార్డోలీ మండలమున జరిగెను. 1930 లో కర్షకులు తమ గృహారామక్షేత్రాదుల నెల్లవీడి విజన ప్రదేశములకుఁ బయనించుచుండిరి. బ్రిటిషు

ప్రభుత్వోద్యోగుల యొత్తిడిలేని ప్రదేశములకు పసువులెత్తిరి. అంధకారబంధురమయిన యర్ధరాత్రములందుఁ గీకారణ్యము లందు దుర్గమ పథములలో నడయాడు ఆ జనసమూహముల స్థితిగతులు వర్ణింపఁదరమా? దేశభక్తి ప్రపూరితులై యత్యంత సాధారణ స్త్రీ పురుషులు అతిలోక సాహసో పేతులై యపూర్వ వీరోత్సాహమున దీపించుట యుద్యమ మహాత్మ్యముగాక మఱేమి? నాయకుల చిత్తశుద్ధి ప్రభావము గాక వేఱేమి? ఇట్టియెడ నిట్టి ప్రజాబృంద మొకటి కస్తూరిబాయి నాయకత్వమునఁ బురోగమించుచున్నది. ప్రయాణ మధ్య మున సంభవించు ప్రమాదముల నధిగమించు చున్నది. సాయంసమయమునకా జనమొక ప్రదేశమును జేరుకొన్నది. బార్డోలీ నగరమునకు వెలుపలనున్న యా ప్రజాసమూహము నందు రెండువందలకుఁ బైఁగా స్త్రీ పురుషులుగలరు. కలరా యాకస్మికముగ వారి నావరించి యందుఁ బెక్కుర వరించి యక్కునఁ జేర్చుకొన మిత్తి కందించెను. కస్తూరిబాయి కన్న మున్నుగఁ బోయిన యా జనసమూహమునుండి వెనుక నున్న యామెకీవార్త చేరినది. ఆ ప్రదేశమున కామెయెట్లు చేరఁగలదు? రాజమార్గములందు స్వచ్ఛంద సైనికదళము లందలి యొక పురుషునకేని తెరువునీయ వీలులేదు. ఎందుఁ జూచినను కత్తులు తుపాకీలు ఎట్టిటోపీలు అప్రమత్తతతో అనన్యచిత్తముతో వర్తించుచున్నవి. ఇతర మార్గములన్నియు పంకసంకలితములై దుర్గమములై యున్నవి. అది వర్షాకాలము. ఇఁక దారితీరు చెప్పఁబనిలేదు. అయినను కస్తూరిబాయి

యత్యంతసహనముతో, నకుంఠిత దీక్షతో విప్లవకారుల విడిది చేరుకున్నది.

ఆ ప్రదేశము మానవ వ్యథా కేంద్రమనఁ దగియున్నది. నరకప్రాయము. గుడిసెలలో పశువులు మానవులు జీవాద్వైతసిద్ధి నంది యానందించుచున్నారేమో! దుర్గంధ భూయిష్ఠమై, మశకసమాకృష్టమై, భూలోక నరకమై దుర్భర యాతనలకు నిదానమైనది యాప్రదేశము. దోమలు ప్రజా రక్తములఁబీల్చి పెంపొంది భయంకర రూపములు ధరించుచున్నవి. శిశువులు అసువులు గోల్పోవుచున్నారు. వ్యాధుల నామరూపములు దెలియ సాధ్యములు గాకున్నను వాని ప్రభావము ప్రళయకాలమును దలపించుచున్నది. మృత్యువు తన సహస్ర ముఖములఁదెఱచి యందలి జీవులనెల్ల బలిగొనఁ జూచుచున్నది. స్నానమునకుఁ బానమునకు యోగ్యములగు జలము లెందును గలవయ్యెను. అట్టి ప్రదేశమునకుఁ జేరుకొన్నది కన్నతల్లి కస్తూరి. తన్ననుసరించి వచ్చిన స్వచ్ఛంద సేవకులతో "నేనిచట నొకింత కాలముందును. మీరు మీమీ పనులఁజూడఁబొండు. మీరిచ్చట నుండుట మంచిదిగాదు. పేదలగు వీరు మీ కతిథి సత్కారములఁగావింప యత్నింతురు. వారికి మితిమీఱిన భారము నొదవించిన వారలమగుదుము." అని పలికి వారినిసాఁగనంపి, దరిద్రనారాయణసేవ కియ్యకొనినది.

దుర్విధిపరిపాకమున దుర్భరనరకయాతనలఁ బొలగుచున్న కృషికుల కాత్మవిశ్వాసము గలిగింపఁ గంకణము గట్టుకొన్నది కస్తూరిమాత. పూర్వోదాహృత ప్రదేశమునకు

మాతృశ్రీ సాక్షాత్కారము అచటి వారియాత్మల కుత్తేజము నొదవించినది. అయినను నానాటికి వారిస్థితి వక్రించుచున్నది. ఎంతకని యోర్చి యుండఁగలరు? పాపము! ఒక పేదరైతు కంటికిఁ గడివెడునీరుగ దుఃఖించుచు కస్తూరిబాయిని సమీపించి యిట్లు రోదించెను: "తల్లీ, నేను నాసర్వస్వము గోల్పోతిని. ఒక పక్షము దినములకుఁ బూర్వము జ్వరపీడితుఁడై నా యేకైక పుత్రుఁడు మృత్యు ముఖమునఁబడెను. నేఁడో నా యిల్లాలు గతించినది. ఆమె పోవుచు ఈ మూఁడు నెలల కసిగందును నా కప్పగించినది. దీనిని నేనెట్లు సాకఁగలను? ఎవరు నాకింకదిక్కు? ఎవరిని వేడఁబోయెదను? నా స్థితియు నేఁడో రేపో యనునట్లున్నది. ఆధివ్యాధులు నన్నావరించి యలమటింపఁ జేయుచున్నవి."

ఈ యావేదనము చూపఱల హృదయముల ద్రవింపఁ జేయుటలో సందియములేదు. పొంగి పొరలివచ్చుచున్న దుఃఖము నాపుకొనుచుఁ గంఠమున గాద్గద్యము గదుర, "నాయనా, దుఃఖింపవలదు. ఈశ్వరుఁడే మన రక్షకుఁడు. అతనియెడ నీవెట్టి యపరాధము గావించి యుండలేదు. అతఁడపార దయాసముద్రుడు. అతని పాదముల నాశ్రయింపుము. బాధలన్నియుఁ దొలఁగి పోవును. అతఁడు నిన్నుఁ గన్నతండ్రి కన్న మిన్నగఁ గాపాడును. జగద్భద్రాను సంధాయి యగు రామభద్రుని చరణారవిందముల శరణుఁ జొచ్చిన వారికెట్టి యాపదలును గల్గవు. దేశమాతృసేవాధర్మమున నీవు పుత్రకళత్రాదులఁ గోల్పోయియుఁ జెక్కుచెదరని దీక్షతో నిలిచితివేని నీవు నీతోడివారలకు మార్గదర్శకుఁడ వయ్యెదవు.

సత్యాగ్రహ సాధనమున నసువులఁ గోల్పోయినను వేఁలే. శాశ్వతకీర్తి సాధమున నధివసింతువు. నీ నిరుపమ దేశభక్తికి బాఫు మిగుల సంతసించును. నిన్ను భారత వీరపుత్రునిగఁ బేర్కొనును. అంతకంటెను నీకేమి కావలయును? నాశక్తి వంచనలేక నీకుఁ దోడ్పడెదను. నిన్ను నీ పసిబిడ్డను నాదరించు బాధ్యతనాది. శార్డోలికి నావెంటరమ్ము. నీవీ దుఃఖసముద్రమున నోడ్డుజేరుదనుక నాయొద్దనే యుందువుగాక రమ్ము" అని కరుణాస్వరూపిణి కస్తూరిమాత పలికెను.

అనునయ వాక్యములిట్లు పలుకుచు నాదీన జీవుని దరిజేరి నిలిచియున్న యా మహనీయ రూపొందిన దయా గుణమాయమనట్లు తోచెను. ఇంతలో నాతఁడు ఒకింత సేదదేరి యథాస్థితికి వచ్చెను. వానిచేతులలోని పసిపాపను ఆమె సత్యాగ్రహిణుల చేతులకందించెను. అంత నామె యచటి వారికడ సెలవు గైకొనెను.

ఇంతలో 'ఉండక్' అను ప్రదేశమున నారువురు సత్యాగ్రహిణులు తద్గ్రామాధికారి బారిపడి పలుబాధలకు లోనగుచున్నారనియు, నచటి యుద్యమమునకు నండఁగా నుండఁ గస్తూరిమాత యచటకు రావలయుననియు వార్తవచ్చెను. ఇపుడు ఆమెకు హృదయము ద్వైధీభావము చెందెను. నాఁడు దుష్యంతుని కణ్వాశ్రమస్థ మునీశ్వర సంప్రార్థన యొకవైపు ననుఁ మఱొకవైపున మాతృదేవి వ్రతదీక్షా నిర్వాహణ సంభావనము అను రెండు విభ్యుక్త ధర్మములు లాగినట్లు, కస్తూరిమాత యొకవైపు పేద కర్షకుని శార్డోలికిఁగొంపోయి తగిన రీతి నాదరింతునన్న మాటయు వేఱొకవైపు ఉండక్

గ్రామాధికారి క్రూర హింసలకు గుఱియగుచున్న సత్యాగ్ర హిణుల కండయై నిల్వనేగుట యను కర్తవ్య ద్వయముచే సమాకర్షితయై యుండెను.

శరణార్థియైన కృషీవలుని విడచుటయా? అబలల యార్తనినాదము ననాదరించుటయా? ఎదియుఁ దోపలేదు. ఇతికర్తవ్యవిమూఢయై దరిగానని యాలోచనముసఁబడియున్న యామె యసహాయస్థితిని గమనించినాఁడా కృషికవీరుఁడు. "తల్లీ, నీ దయ యమేయము. స్వార్థపరుఁడనై ఉండక గ్రామమునందలి సత్యాగ్రహిణులకు మీసాయము సకాల మున నందకుండఁ జేయుటకు నాచేతము సమ్మతింపదు. నేనెల్లో నాస్థితిగతులఁ జక్కబరచుకొందుములే. అమ్మా తత్క్షణమ మహిళాజనహితముగోరి యఱుఁగుము. నీసాయము నపేక్షించి నీకొఱకు నిరీక్షించియున్న వారెందఱో, వారినెల్ల నీ వాదరింపవలయునుగదా! తల్లీ, సెలవు." అని యతఁడు పలికి తనబిడ్డనొక దుప్పటియందుంచి యామె ననుగమించుచు నామె యెక్కఁబోవు బస్సునొద్దకేఁగెను. బస్సు సాఁగుటకు ముందు కస్తూరిదేవి కమనీయహస్తమున నాశిశువుంపఁబడెను. ఆమె నిసుఁగు నిటు లాశీర్వదించెను. "విప్లవసమయమునఁ బుట్టిన యీ చిట్టి చిరకాలము వర్ధిల్లుఁగాక. దేశసేవజేసి మాతృఋణమునీగుఁగాక." ఎంతటి మహనీయ మీ యాశీస్సు!

అటనుండి కస్తూరిబాయి పురోగమింపసాగినది. మాఱు మూలలనున్న ప్రతి జనపదమునకుఁబోయినది. ఆమెలో నవశక్తి యుజ్జ్వలజ్వాలల వెలిఁగ్రక్కుచున్నది. ఏ మూల నుండి పిలుపువచ్చినను, దూరమనక భారమనక ఆమూలకుఁ

బర్విషుచుండెను. విషమ పరిస్థితులలోఁగూడ జంకుగొంకు లేక తదనుగుణ్యముగ నాయకత్వమునో అనుయాయిత్వమునో యందుచు కర్తవ్యనిర్వహణమునఁ ప్రాల్మాలక పాటువడు చుండెను. ఆమెకుఁగల ధైర్యసాహసములు, పరిసరానుగుణ వర్తనము, సమయోచిత ప్రజ్ఞ పురుష నాయకులకుఁగూడ మృగ్యమనిపించెను. సబర్మత్యాశ్రమమందువలెనే ధూమ శకటయాన సమయమునఁగూడ వర్తించెను. ఆశ్రమసూత్రము లను 'తు చ' తప్పక యెచటనున్నను నమలుగావించెడిది. ఆమె దినచర్య వేకువ నాలుగవ గంటకుఁ బ్రార్థనతో నారంభము. గ్రామముల కేఁగినపు డందలి గ్రామీణు లామె వస్త్రముల నుదికి యిత్తుమన్నను వారి ప్రార్థన కియ్యకొనదు. తన వస్త్రములఁ దానే యుదికికొనును. ఆశ్రమవాసు లందఱ కిది యొక నియమము. ఇట్టి నియమము లెన్నిగలవో యన్నింటిని సాక్షరముగ సలక్షణముగ సాగించెడిదామె. ఆశ్రమమునందు వలెనే యెవరియింట నున్నను చప్పిడి యాహారమునే గైకొనెడిది. సుగంధద్రవ్యముల వేయనిచ్చెడిదిగాదు. రైలుప్రయాణము సాగించుచు నడుమనడుమ సత్యాగ్రహుల వృత్తాంతము లెప్పటి వప్పుడు తెలిసికొనుచుండెడిది. గ్రామములందు ప్రజాచైతన్య మెట్లు విద్యోతమాన మగుచుండెనో తెలిసికొని తదనుగుణ వర్తనమునఁ గీర్తనీయ యయ్యెడిది. విశ్రాంతి యొకింత లభించెనా, వెంటనే యామె కనులుమూసి గీతా శ్లోకములఁ గొన్నింటి ధ్యానపూర్వకముగ మననముగావించెడిది. చదువు బాల్యమునఁ బడయకున్నను నామె గీత నామూలాగ్ర పఠనము గావించినది.

అయినను బాల్యమున విద్యాభ్యాసము గావింపనందు లకు మిగులఁ బశ్చాత్తాపము నొందెను. ఎవరైన వార్తా పత్రికను గడగడ జదువ నారంభించుచో నాతఁడెంత కృతార్థుఁడో కదా యని యసూయపడును. ఒకనాఁడు తన యను యాయి బృందము నుద్దేశించి యిట్లనుడివెను: "కటా! బాల్యమునఁ జదుపనేర్వనైతిగదా! ఒకనాఁడు నేనిటులు వార్తా పత్రికా విలేఖరులకు సందేశములు వాఙ్మూలములు నీయవలసి వచ్చునని నాఁడు నాకుఁ దెలిసియుండినఁ జక్కఁగఁ జదివియుండెడిదాననేమో! నాకుఁ బదుమూఁడవయేట వివాహ మైనది. నాఁడు నేను నిరక్షరాస్యను. బాపు నాకు విద్యనేర్ప వలయునని యెంతయో యాకాంక్షించినాఁడు. కాని నాగమ నము మందమయినది. వర్ణ సమామ్నాయము వచ్చునప్పటికి కొన్ని మాసములు పట్టినవి. బాపూజీ యప్పు డప్పుడు నా మందగమనమునకు నిరుత్సాహము నొందినను ఓర్పువహించి నేర్పుమెయి బోధించుచుండెను. బడికిఁ బోయియుండిన నెంత బాగుండెడిది!"

బాపుజీ యెంతగఁ గృషిగావించినను ఆమెకు లభించిన విద్య యత్యల్పము. గుజరాతీ పత్రికలను మాత్ర మొకింత పఠింపఁగలదు. ఆంగ్ల మత్యంతము దురవగాహమయ్యెను. ఎవ రేని ఆంగ్లపత్రికను తెచ్చినయెడల నత్యాసక్తితోఁ దీసికొని పెద్దపెద్ద యక్కరములమాత్రము కలయఁబలుక యత్నించి యంతటతృప్తిపడి పుటల నటునిటు త్రిప్పి బాపుజీ ఛాయా చిత్రమెందైనఁ గలదేమో యని చూచును. అనుదినము పత్రికలలో బాపుజీకి సంబంధించిన విషయ మేదేని యుందు

నని యామెకు సంపూర్ణముగఁ దెలియును. పార్శ్వవర్తులను బాపుజీ యారోగ్యాదిక వార్తావివరణము గావింపఁగోరును. అమ్మహామహుని యమృత సందేశవాక్యముల విన నుత్సహించును.

ప్రయాణసమయములందు రాజకీయములందుఁ దనకుఁ గల జ్ఞానమును విస్తృతము గావించుకొనుటకు హృదయపూర్వకముగ యత్నించును. సర్వ విషయములను తోడివారి నడిగి తెలిసికొనుచుండును. నాయకత్వము తనకుఁ దన యోగ్యతకు మించి లభించెననియుఁ దాను సర్వవిషయముల నామూలాగ్రముగ గ్రహింపకున్నఁ బ్రమాదము వాటిల్లు ననియు సంపూర్ణముగ నెఱింగి యప్రమత్తయై యెల్ల విషయముల నెంతటిశ్రమ కేని యోర్చి నేర్చుచుండును. పఠన, లేఖన, గణితములనఁబడు విద్యా మూలకత్రయిని బాల్యమునఁ బడయని హేతువున మిగుల బాధపడెడిది. ప్రతిదినారంభమునను వార్తాపత్రికాపఠయితల నడిగి యందలి విషయములఁగూర్చి యత్యంత శ్రద్ధాభక్తులతో శిశుమనస్తత్వముతో నడుగును. ఆమె తన యమాయికత్వమునకు సిగ్గిలదు. తెలియని విషయముఁ దెలియుటకు లజ్జింపదు. రాజకీయపరిజ్ఞానము ప్రపంచ చరిత్ర జ్ఞానము తక్కువ గావచ్చునుగాని గాంధేయ సిద్ధాంతమామూలాగ్రముగ నెఱుఁగును. గుజరాతురాష్ట్రమునఁ బల్లెలకుఁబోయినప్పుడు కృషిక లోకమునకు సాధారణ ప్రజానీకమునకు సులభశైలిలో మృదుమధుర వాక్కులలో తత్సిద్ధాంత రహస్యము లెఱుకపఱచును. పత్రికలకుఁ బంపు వాఙ్మూలములుగూడ నత్యంత సరళములై యుండును.

గుజరాతు రాష్ట్రమునను, ఇతర ప్రాంతములందును ప్రజానీకమున కామె కన్నతల్లియే. అమృత రూపిణియగు నామె ప్రభావ మభివర్ణనీయము. జనహృదయ వశీకరణమున భర్త కెందును దీసిపోదు. 'గాంధీ ఇర్విను ఒడంబడిక' పైన పిమ్మట నొక జనపదమునఁ బర్యటించుచుండగా నొక రైతు కుమారుఁడు తల్లి నడుగు వడువున నిట్లడిగెను: "బాపు పూర్తిగ రైతుల మఱచినాఁడు." ఆపలుకుల కిట్లామె సమాధానించెను: "నాయనా, బాపు ప్రజాసేవకుఁడు. ప్రజలకు మేలొనరింపని పని నెన్నఁడు గావింపఁడు. నీవు చెప్పిన విషయము నాయనకుఁ దెలిపెదను."

తిలకినీతిలకముగదా కస్తూరి. భారతీయ నారీధర్మము సంపూర్ణముగ ననుష్ఠించును. పతియే దైవమను సూక్తిని త్రికరణశుద్ధిగఁ బాటించును. భర్తచరణారవింద సంసేవనము పావనమని తదాచరణమున నిమగ్నమై యుండుటయేగాక యతని యెడ సర్వసమర్పణబుద్ధితో వర్తించును. అతఁడు సచ్చిదానంద స్వరూపుఁడనియు, నతని యమృతవాక్కులు సత్యతేజో విలసితములనియు, నతఁడెన్నఁడును నధర్మమునకుఁ బాల్పడ డనియు నామెకు సంపూర్ణవిశ్వాసము. ఆతని చర్యలు తనకు విమర్శనీయములు గావనుతలంపున నందంతర్గర్భితమైన తత్త్వము నెఱుంగఁ దివురును. కష్టమైనను సుఖమైనను అతని యడుగు జాడల నడయాడును. తలలోనాల్కయై మెలఁగును. ఒకప్పు డొకరు బాల్యదాంపత్య లౌల్యమున బాపూజీ వర్తనముఁ గూర్చి యడుగఁగా నామె యేమి పలికెనో గమనింపుడు: "మహాత్ముఁడెప్పుడును మహాత్ముఁడే. అతఁడెన్నడును

సత్యాన్వేషణ పరాఙ్ముఖుఁడు కాఁడు. తన తప్పులనెన్నఁడు నొప్పులుగ సమర్థించుకొనడు. తప్పుల నొప్పుకొని యాతప్పుల మఱలఁ జేయకుండుటయే యతనిలోని గొప్పతనము. అతఁడు నాకెన్నఁ డపకృతిజేసి యెఱుఁగడు. అతని మనోగతము నెఱుఁగక మోఁఆకుదనము వహించినది నేనే."

బార్డోలి బర్సాదు సత్యాగ్రహ సమరముల యనంత రము నాలుగు సంవత్సరములకు అనఁగా 1935 సంవత్సరమున సేవాగ్రామమునఁ జూడఁదటస్థించిన యొకవ్యక్తి యిట్లామె యునికిని వర్ణించెను:

"సేవాగ్రామమున నొక కుటీరమున వారినివాసము. అందామె గృహకృత్యములు సాధారణ స్త్రీవలెనే నిర్వహిం చుచుండును. రాజకీయోద్యమ నాయకత్వా లక్షణలక్షిత గర్వ మెందు నటఁగన్పింపదు. ఆఱ్ముగ్గిన పండువంటి ముసలి ముత్తైదువ వేదమాతవోలెఁ గన్నతల్లి కస్తూరి కన్నులకు గోచరించును. ఆ యమలచరిత స్వయముగ నన్నపానీయాదుల సిద్ధపరచుచుండును. వేయికనులతో నెల్లపనులఁగనుచుండును. అయినను తుదకామె ప్రశాంత జీవనమునే వాంఛించెను. ఆమె యొకచోఁ గూర్చుండి ధాన్యమును సరిచేయుచుండ నామెకు ప్రక్కగదిలో జగద్విఖ్యాత శాంతిదూత హరిజన పత్రికకు సంబంధించిన వ్యాసముల రచించుచుండును. నిరం తరము నిరంతరాయముగ సాఁగుచుండు ఉత్తరప్రత్యుత్తర పర్యాలోకన నిమగ్నుఁడై యుండును. లేదా కాలమున నొక క్షణమునేని దుర్వ్యయముసేయ నొల్లని యోగిపుంగవుఁడు తక్లీపై నూలు వడకుచుండును. ఈవడకుటయేగదా బ్రిటిషు

రాజకీయవేత్తలకు వడకు పుట్టించినది! ఈ తక్లీ ఘానుష్ఠాని చేతినూలుపోఁగేకదా భారతీయ దాస్యబంధ విమోచనకారి యైనది. భారత జాత్యైక్యమునకీ నూలుపోఁగేకదా హేతు వైనది. మహాత్ముని దైహిక మానసికాధ్యాత్మిక క్రియలలో నెల్లఁ బ్రాణమునకుఁ బ్రాణమై యతనికిఁ బ్రాణ మొసఁగు నది తుద కామెయే. భర్తృసేవయే తన లక్ష్యమనినమ్మి, ప్రత్యుపకార పరాఙ్ముఖియై నిర్మలానురాగ నిబద్ధయై యతనికి వృద్ధాప్యమునఁ దాను వృద్ధాంగనయయ్యుఁ గంటికిఱెప్పయై కాలికి ముచ్చెయై కన్నతల్లివలె నన్నపానాదుల విషయమున నతిశ్రద్ధాళువై యుపచరింప నిశ్చయించుకొన్నది. ఆ నిశ్చ యమునేమఱక యాచరింపఁ దొడఁగినది.

ఈ విషయమున నామెకుఁ దోడునీడయైనది మీరా బెన్. అప్పుడప్పుడు కస్తూరిమాత మీరాబెన్ పెంచుచున్న కూరగాయలను గాంధీగారి నిమిత్తము దేనరుగును. ఆ యా సంస్థలను బరిశీలించును. ఈ సమయమునఁజూచువారికామె యనుక్షణము భర్తృపరిచర్యకే వినియోగింప సంకల్పించె ననుట విస్పష్టముగ గోచరించును. సర్వసంగ పరిత్యాగియై యాసన్నమృత్యువు నెఱిఁగి భవభీతుఁడై యితరమునొల్లక శ్రీహరిచరణ సరోజ మరంద బిందు బృందమును సదా గ్రోలనాశించు ముముక్షువుక్రియ నాయమ భర్తృసేవకుఁ దుది దినములందుఁ బూనెననఁదగియుండెను. స్త్రీలకు సంతరణో పాయము భర్తృసేవయేగదా! అదియే యామె కత్యంత ప్రియము. మహాత్మునికిజీవాతువై వరలుటయే యామె యంతి మాశయమనుటకనేక నిదర్శనములు గలవు. ఒకప్పు డాతఁడు

ప్రాణాపాయ స్థితియందుండెను. భిషగ్వరులు తమ భేషజము నకుఁదోడాహార నియామకమును వాంఛించిరి. పాలు తీసికొని ననేగాని బలము చేకూరదనియు బలము చేకూరనిచోఁ జికిత్స దుస్సాధ్యమనియుఁ జెప్పిరి. ఎన్నఁడో శపథముగా నేను పాలు త్రావనని గాంధీజీ. సామాన్య విశేషధర్మములలో సామాన్య ధర్మానుష్ఠానము ముఖ్యముగాదను విషయమెఱిఁగియు, లోకాదర్శకుఁడుగఁ బరిగణింపఁబడు తానే వాగ్దోషమునకుఁ బాల్పడెనేని తన కప్రతిష్ఠయేగాక తన యుద్యమమునకు భంగకరమనియో మఱి యెట్టి హేతువుననో మహాత్ముఁడా శపథమును దృష్టియందుంచుకొని 'ససేమిరా' యని బిఱ్ఱబిగిసి యుండెను. ఇపుడాతనికి హితవుజెప్పి యొప్పింప నేరికి సాధ్యపడును? ఇపుడు కస్తూరిమాత తన లోకజ్ఞాన పరిమళమును వెదజల్లి మోహనుని ముగ్ధుని గావించినది. "ఔను. బాపు ప్రతిన నూనినమాట వాస్తవమే. అది సాక్షరముగఁ జెల్లవలసి యుండుటయు యుక్తమే. ప్రాణ విత్త మానభంగమందు బొంకఁజెల్లునను శుక్రనీతి యపరిగ్రాహ్యమనుటయు సమంజసమే. కాని యొకవిషయము సమాలోచనీయము. పాలన లోకులదృష్టియందు ఆవుపాలు లేదా గేదెపాలు. మేకపాలని వారు గ్రహింపరు. మేకపాలు ఆరోగ్యప్రదము. మేకపాలు నేలొాదవించుచో స్వీకరించుట మేలేకదా! ఇందు ప్రతిజ్ఞా భంగ ముండదు." ఈ సమ్మోహనాస్త్రము సత్యసంబద్ధమై సమంత్రకమై చక్కఁగాఁ బనిచేసినది. మహాత్ముఁడిందుల కియ్యకొనుటయేగాక యావజ్జీవితము వేరుసెనగ పప్పు మేక పాలు అనుదినాహారముగఁ జేకొనెను. ఇట్లెన్ని పర్యాయములో

నెన్నివిషయములలోనో యతని కనేకవిధముల నుపకరించియుం డును. కాని యామె ప్రతిభ భర్తృతేజమున విలీనమై ప్రత్యక్ష గోచరము కాలేదనుటకు శ్రీమతి సరోజినీనాయుడు మున్నగు వారిసాక్ష్యము లున్నవి. భర్తృపరిచర్యయే తన యేకైకలక్ష్య ముగ వర్తించుట గమనీయము. ఆయనదుఃఖమే తనకు దుఃఖ ముగను ఆయన సంతోషమే తనకుసంతోషముగను ఆయన యిష్టానిష్టములే తనకు నట్టివిగను సంపూర్ణముగ స్వకీయమును విస్మరించి, అతఁడు స్వామి, నేను తనదాన నను భావమును సంపూర్ణముగ ననుష్ఠింపదొడఁగిన దనుటకుఁ బెక్కునిదర్శన ములు గలవు.

ఒకప్పుడు సేవాగ్రామమునందు గాంధీగారి యాశ్రమ వాసు లకాలమృత్యుముఖమునఁ బడఁజొచ్చిరి. దినదినము మృతుల సంఖ్య పెరుగుచుండెను. సంకుచిత బుద్ధులు కొందఱు ఈయాకస్మిక మరణములకుఁ గారణము గాంధీజీ యాహార మునఁజేసిన నియమమని పేర్కొనిరి. ఇట్టి దుర్విమర్శలకుఁ గాదుగాని సహచరులిట్లు లకారణముగ మృత్యుముఖమునఁ బడుచున్నారే యను ననుతాపము మహాత్మునకు హెచ్చినది. పాపము కస్తూరిబాయియుఁ జింతాకులస్వాంత యైనది. ఈ పురాణదంపతులు అనుక్షణము రోగులకడ కేఁగి పరా మర్శించుచు వలయు వైద్యసహాయము గావింతురు. అప్పు డామె భర్తననుసరించుచు నడయాడునప్పు డతని నీడయా యనునట్లూహింపనయ్యెడిది. ఒక రామె నిట్లు ప్రశ్నించిరి, "తల్లీ, నీముఖవైవర్ణ్యమునకు హేతువడుగవచ్చునా? నీయా రోగ్యము చక్కగాలేదా?" అందులకామె యిట్లు ప్రత్యుత్తర

మొసఁగెను: "నాకు మానసికముగఁదప్ప నెందును ననారోగ్యములేదు. బాపు విచారగ్రస్తుఁడై యున్నాఁడు. అదియే నా మానసికాందోళన హేతువు."

కల్యాణపూర్ణుఁడను నొక బాలుఁడు కస్తూరిబాయి ననుగమించు దేశసేవాపరాయణుఁడు గలఁడు. అతని తలిదండ్రుల కతఁడొకఁడే కొడుకు. అతఁడు దేశసేవ గావించుచుఁ దమ్ము విడచి యుండుట సహింపక యతని తల్లి సేవాగ్రామమునకు వచ్చి కుమారుని రాఁగోరెను. అతఁడు తల్లినిమన్నించు కస్తూరి మాతృదేవిని విడచి యేగుటకిష్టములేక యావిషయమై యామె యనుజ్ఞ వేడుమనెను. అందుల కతని తల్లి యంగీకరించెను. దానితో నతనిబాధ్యతతీఱిపోయెను. ఆమె కస్తూరిబాయి కడకేగి, "తల్లీ, వీఁడు మాయేకైక పుత్రుఁడు. వీనిని చూడని యొకక్షణ మొకయుగముగ నుండును. వీనిని నింటికిఁ బంపుఁ" డని బ్రతిమలాడెను. అప్పుడు కస్తూరిబాయి మందస్మితము గావించి "నీవదృష్టవతివి. నీకొక్క కుమారుని గూర్చియే చింత. నాకు మువ్వురు కుమారులు. వారందరును దేశసేవ చేయుచు మమ్ము విడిచియుందురు. నీకుఁ గుమార్తెలుగలరా?" అనెను. ఆపిల్లవాని తల్లి తన కొక కుమార్తెగలదనియు నామె యత్తవారింటి కేఁగినదనియుఁ దెలిపెను. "అట్లైన నీవదృష్టవంతురాలవు. నాకొక కుమార్తెయులేదు. ఆడుబిడ్డల యనురాగము అనుభవైకవేద్యము. అది చవిచూచుభాగ్యమే కొలదిమందికో! నాకుఁ గన్నకూతులులేరు. ఒక యామెను

పెంచుకొంటిని. ఆమె పేరు లక్ష్మి. ఆమె హరిజనకుటుంబము నకుఁ జెందినది. ఆమెకూడ ఇప్పుడు నాయొద్దలేదు. భర్తృ వియోగము, పుత్రవియోగము పుత్రికావియోగము ఇవి యన్నియు దేశసేవార్థము సంతోషముగ సహించుచుంటిని. వారెల్లరు దేశసేవా దీక్షాదక్షులై యుండుటయే నాకు హర్షోత్కర్ష హేతువు.”

# 16. మాతృవేదన

నాఁడు వసుమతీ వరాహ మూర్తులకుఁ గుమారుఁడై కుమార్గ వర్తియై ప్రబలి యసురచక్రవర్తి కాలేదా నరకుఁడు. అదితి కుండలముల హరించి యమరాధిపుల నెల్ల నడంచి యచ్చగ నచ్చరలఁబోలు షోడశ సహస్ర సుందరీమణులఁ గారాగృహ బద్ధులఁ గావింపఁడా యా దుర్బుద్ధి. కుమారుఁడని మన్నింపక వసుంధరాది వరాహదేవులే సత్యాకృష్ణులై నిర్దాక్షిణ్యముగ నతని సంహరించిరి కదా! అమృతాంభోధియందు జ్వాలాభీల హాలాహలము వొడమలేదా! అట్టులే పూజ్య బాపూజీ ప్రణయ సామ్రాజ్యలక్ష్మియగు కస్తూరి గర్భమున కళంకియై యుద్భవించె నగ్రసుతుఁడై హీరలాలు. అతఁడు హైందవ మత విద్వేషియై మహమ్మదీయమత స్వీకారము గావించెను. దానికేమి? పూర్వజన్మ కర్మానుబంధమున బుద్ధులు వొడమి యన్యమతములం దభిరుచి జనించినది యనుకొందమన్న ఆ మతసిద్ధాంతమున కనుగుణముగనైన శుద్ధాంతఃకరణముతో వర్తింపవచ్చునుగదా! ఏబదియేండ్ల ప్రాయమున సైతము నెగ్గు సిగ్గులేక నడువీధులలోఁ ద్రాగి త్రైతక్క లాడుటయా! జగద్వంద్యుఁడగు జనకుని దూలనాడుటయా? ఈ వైపరీత్య మేమి? దీనికిఁ గారణమును గారణపురుషుఁడు గాంధీజీయే తెలిపియున్నవాఁడు. "హీరలాలు మాతృగర్భస్థుఁడగుటకు మున్ను బాలదంపతుల భావము లేకీకృతములు గాలేదు. గాంధీజీ కామపారవశ్యమునఁ గస్తూరియెడ నున్మత్తచర్యలు గావించెను. ఈచర్యలకు మూలముగఁ బ్రేమ విశుద్ధమైనది యుండుట వాస్తవమే కాని బాహ్యావర్తనముగూడఁ దత్తుల్య

ముగ నుండక భిన్నరీతి నుండుటచే హీరలాలువంటి మరంత పరితాపహేతుభూతుడుదయించెను.”

“ప్రియతనయా, హీరలాలూ,

ఇటీవల చెన్నపురి నడివీధియందు మధుపానమత్తుండవై యొడలు దెలియక తిరుగుచుండ నిన్నచటి రక్షకభటులు బంధించియుంచి మఱునాఁడు న్యాయాధిపతికడకుఁ గొంపోవ నతఁడు నిన్ను విచారించి యొక రూప్యము జరిమానా విధించి విడిచిరని తెలియవచ్చినది. వారు నీయెడ నుదారముగ వర్తించిరి కావుననే నీకట్టి సులభశిక్ష విధించిరి.

న్యాయాధిపతియు నీజనకునిపైఁగల పూజ్యభావమును పురస్కరించుకొనియే నిన్నట్టి నామమాత్ర శిక్షకుఁ బాత్రుని జేసిరి. అయినను నా కీవార్త మనశ్శల్యమై మిగుల బాధాకరమై యున్నది. ఆ రాత్రి నీవొంటినైన సంచరించుచుంటివో వెంట నెవరేని గలరో యెఱుకపడలేదు. ఎట్లులైనను నీవు కడుధూర్తుఁడవై చరించితివి.

ఇట్టియెడ నీకేమి తెలుపవలయునో తోఁచుటలేదు. ఇంతకాలము నిన్నుగూర్చి నీవు జాగ్రతకలవాఁడవై వర్తించుట యెంతయు లగ్గని యనేకపర్యాయములు నీకుఁ జెప్పుచునే యుంటిని. నామాటను తృణీకరించి నానాఁటికిఁ జెడిపోవుచుంటివి. నాయునికిని దుర్ఘటము సేయుచున్నావు. జీవిత సాయంసంధ్యాసమయమున వృద్ధులగు నీ జననీ జనకులకు నీవెంతటి పరితాపమును గూర్చుచున్నావో గమనించుటలేదు.

పూజ్యుఁడగు నీ జనకుఁ డెవరితోడ నెట్టి దుఃఖమును వెల్లడింపఁడు. కాని నీవొనర్చు దుశ్చర్యలతని హృదయమును

భేదించుచున్నవి. మమ్ముల నిట్లు దుఃఖములఁబాల్సేసి పాప మున కొడిగట్టినవాఁడవు. పుత్రుఁడవై పుట్టితివిగాని శత్రుని వలె వర్తించుచున్నావు.

ఇటీవల నీవుగావించిన సంచారములలో నీ జనకుని విమర్శించుచుఁ బరిహసించుచున్నావనియుఁ దెలియవచ్చినది. నీవంటి మేధావంతునకుఁ దగినపని కాదు. నీవు నీ తండ్రిని గూర్చి దుష్ప్రసంగములఁ గావించి నీవే యవమానితుఁడ వగుచున్నావు. అతనికి నీయందు వాత్సల్యముతప్ప ద్వేషాది భావములు లేవు. నిష్కళంకమైన నడవడికాయన ప్రాధాన్య మిచ్చునని నీవ యెఱుంగుదువు. కాని నీవెన్నఁడమ్మహాశయుని యుపదేశము ననుసరించి యెఱుఁగవు. అయినను నిన్ను దనతో నుండుమనియు నీకు వలయు నన్నవస్త్రాది సౌకర్యము లెల్లఁ దానే కూర్తుననియు నతఁడు తెలిపియున్నాఁడు. ఆయన యౌదార్యమును గుఱుతింపవైతివి.

ఈప్రపంచమున మీతండ్రి నిర్వహింపవలసిన బాధ్యత లసంఖ్యాకములు. అతఁడింతకంటె నెట్టియుపకృతియుఁ జేయఁజాలఁడు. నీదుస్థితి కాతఁడు దుఃఖించును. భగవంతుఁ డతనికఖండమగు సంకల్పదార్ఢ్యము నొసఁగియున్నాఁడు. అతఁడు ప్రపంచమున తన సిద్ధాంతముల వ్యాప్తిగావించు టకు వలయు దీర్ఘాయురారోగ్య భాగ్యము లొసఁగుగాత! నేనో దుర్బలహృదయను. నీ విషయమున నాకుఁగలుగు చున్న దుఃఖపరితాపములపరిమితములు. వానిని నేను భరింపఁజాలకున్నాను.

నీ దుష్ప్రవర్తననుగూర్చి పలువురు మీ తండ్రికి జాబులు వ్రాయుచుందురు. అతఁ డీ మహావమానమును భరింపవలసియుండును. నీవు నా యునికిని మనికిని దుర్భరము గావించుచున్నాఁడవు. నీవంటి పుత్రుని గన్నందులకు ఫలముగా బంధుమిత్రుల యెదుటను నూతనాగంతుకుల యెదుటను తలయెత్తి తిరుగఁజాలకున్నాను. నీ తండ్రి నిన్నెప్పుడైనను క్షమించును. జగజ్జనకుఁడు నిన్నెన్నఁడును క్షమింపఁజాలఁడు.

మదరాసులో నొక మహాశయుని గృహమునం దతిథివైయుండి యచట మర్యాద నతిక్రమించి యతనిని దూషించుచు నందుండి వెడలుట మున్నగు నీ యవిచారిత చరిత తెలియవచ్చినది. కటా! ఆ గృహస్థుని హృదయము నీమూలమున నెంత తపించెనో.

ప్రతిదినమునఁ బ్రత్యూషమున వచ్చు పత్రికల పఠించుచో గుండె దడదడ కొట్టుకొనును శరీరము చెమర్చును నీదుర్వర్తననుగూర్చి యేక్రొత్త వార్తలు విననలసియుండునో యని. ఒక్కొకప్పుడు నీవెక్కడనుంటివో, ఏమిచేయుచుంటివో, ఎందేమి భుజింతువో, ఎచటనెట్లు శయనింతువో అని విచారించుచుందును. బహుశః నీవు నిషిద్ధాహారము గైకొందువు. ఈ విషయమును, ఇట్టి హాని నితరమును గూర్చిన తలంపులు నాకు వచ్చి రాత్రులందు నిదురపట్టదు. తఱచు నిన్ను గలిసికొని మాటాడ వలయునని యనిపించును. కాని నీ వెక్కడనున్నావని నీ యొద్దకువత్తును? నీవు నా జ్యేష్ఠ పుత్రుఁడవు. నీకిపుడేబది యేండ్ల ప్రాయము. నిన్ను సమీపించుటకుఁ

గూడ నాకు భయమగుచుండును. నీవు నన్ను గొట్టుటకుగూడ వెనుదీయవని నాకనుమానము గలుగుచున్నది.

నీవు నీపూర్వ మతము నేల మార్చుకొంటివో బోధ పడదు. అది నీ యిష్టము. దాని నెవఁడును గాదనఁజాలఁడను కొన్నను నీవు పలువురఁ బ్రబోధించి నిన్ననుసరింపఁ గోరు చున్నావనియు, అమాయిక ప్రజలెందఱో భ్రష్టులగు చున్నా రనియుఁ దెలియుచున్నది. తాఁజెడ్డ క్రోతి వనమెల్లఁ జెఱుప వలయునుగాఁబోలును! తోక తెగిననక్క తోఁడినక్కలకుఁ గూడ తోకలు త్రెంచు కొనుఁడని యుపదేశింప వలయును గాఁబోలు! నీ యవధుల నీవు గుర్తింపవేల? నీకు మతమన నేమియో తెలియునా? ఇప్పటి నీ మనఃస్థితి ననుసరించి నీవెట్టి నిర్ణయమునకు-రాఁగలవు? మనసు నిలకడలేని నీకు మతతత్త్వ మెట్లు గోచరించును? నీవు మహాత్ముని పుత్రుఁడవనియు, లోకోత్తర చరిత్రుఁడవనియు జనులు నీ వచనముల విశ్వసింతురు. నీవు పండిత పుత్రుఁడవని తెలిసికొనఁజాలరు. తెలిసి కొన్న పిమ్మట పశ్చాత్తప్తులగుదురు. నీకు మత ప్రబోధము గావింపఁదగిన యోగ్యతలేదు. ఇదేవిధమునఁ బ్రవర్తింతు వేని నీ వెల్లఱచే నవమానితుఁడవయ్యెదవు. నీ వొకింత నిలిచి యాలోచించి తప్పు తెలిసికొని వెనుదిరుగుము. ఇది నీకు శ్రేయోదాయకము.

తొలుత నీవు మతము మార్చుకొనుట యనునది నాకు నచ్చకున్నను, పిమ్మట నీవు నీయాత్మవికాసమునకుఁగృషి చేయ సంకల్పించినటు లొనర్చిన ప్రకటన నా కొకింత యూరటఁగలిగించినది. మత మేదియైననేమి సన్మార్గగామి

యగుచున్నాఁడుగదా నాయనుఁగుబిడ్డడని మనమున సంత సించితిని. ఇటు చూతునుగదా నీనడవడి 'భ్రష్టస్యకావాగతిః' అను నానుడి కొరవడి దిద్దుచున్నది. నా హృదయ మెంతగ దహించుకొని పోవుచున్నదో, నిన్నుగూర్చిన నాయాసలెల్ల నెట్లడియాసలైనవో నీ వెఱుంగవు.

నీ కుమారు లెంతగ పరితపించు చున్నారో నీకు దెలి యును. నీకుమార్తెయు, నీ యల్లుఁడును నీ మూలమున నెంతటి చింతకు లోనగుచున్నారో ఎటు లా దుఃఖభారమును వహిం చుచున్నారో తెలిసికొనియే యుందువు. నామాటవిని సరి యైన బాటకువచ్చి మమ్ముద్ధరింపుము తండ్రీ."

హీరలాలుకువ్రాసిన పై లేఖతోపాటు అతని ముస్లిము మిత్రుల కామె యొక లేఖవ్రాసెను. అందిట్లుకలదు. "ఇందు నేను నాకుమారుఁడు హీరలాలు చర్యలోఁబాల్గొను ముస్లిము లనే యుద్దేశించి వ్రాయుచున్నాను. వారికే యీ నా పలు కులు. మీ రెందులకు వాని కండయైనిలిచి దుష్కృత్యములకుఁ బ్రోత్సహించుచున్నారో నాకుఁ దెలియుటలేదు. ఆలోచనా శక్తిగల ముస్లిములెల్లఱును ముస్లిములలో మాకు యావజ్జీవ మిత్రులెల్లఱును ఈ మతాంతర పరివృత్తి మొదలుగాఁగల దుర్వృత్తి కథనములెల్ల నిరసింతురని యెఱుఁగుదును. వారిని గూర్చి నాకు సంతోషము మిక్కుటము.

మతాంతరిత యతని సరిదిద్దుటకు మాఱుగ నధఃపతన స్థితికి దారి దీసినది. కొందఱు వానికి మౌల్వీబిరుదము నీయ సాహసించిరట! ఇది సరియైన రీతియా? నాకుమారునిబోలు

పతితుఁడట్టి యున్నత పదవినందుటకు మీ మతము సమ్మ
తించునా ?

ఇట్లతనికి దుర్భ్రమ గలిగించి యహంకృతిబంధురు
గావించుటచే మీ రెట్టి యానందానుభూతి వడయుచున్నారో
నాకు దురూహ్యము. మీరతనికి మంచి చేయుటలేదు.
మమ్ములను పరిహాసాస్పదులఁ జేయుటయే మీయాశయమ
గుచో నేను చెప్పునది యేదియులేదు. మీ యిచ్ఛవచ్చినంత
దుష్ప్రచారముఁ జేసికొనవచ్చును.

పుత్రశోకాకుల యగు మాతృమూర్తి నిస్సహాయా ర్త
నాదము మీకీ విషయమునఁ బ్రోత్సాహకులగువారి హృద
యములందు కరుణ యుదయింపఁజేయదా ? నేను నా కుమా
రునికిఁ బల్మారుచేయు నెచ్చరికయే చేయుదును మీకుఁగూడ:
మీచేయునది సర్వసాక్షి యగు దేవుని దృష్టిలో దౌష్ట్యము."

# 17. ఉపసంహారము

కారాగృహమునఁ గాంతాతిలకము కస్తూరిబాయి కాంతుని పార్శ్వమున నాసీనయై, సమస్త బంధుమిత్రులు బాష్ప పూరితలోచనులై పరివేష్టించియుండఁ బ్రాణేశ్వర పాదకమల నిహిత విమల హృదయపద్మయై దివ్యసువాసినీ లోకమున కేఁగినది. ఈ వార్త యనతికాలములో ప్రపంచము నలుగడల వ్యాపించినది. ప్రముఖనాయకులు, పత్రికలు, విదేశీయ స్వదేశీయ విభేదములేక యెల్లరుఁ దమ హృదయవేదనను ముక్తకంఠమున వ్యక్తీకరించిరి.

సుప్రసిద్ధ కవయిత్రి, మహాత్ముని నాయకత్వమున నచంచల విశ్వాసముగలది, విశేషించి తెలుఁగువారి కోడలు శ్రీమతి సరోజనీ నాయుఁడిట్లు వాకృచ్చెను:

"భారత సాధ్వీలోకమునకుఁ బ్రతినిధి యనఁదగినయబల వీరనారీవంతసము కస్తూరిమాత యాత్మశాంతి సౌఖ్యముల నలరారుఁగాక. తాను హృదయపూర్వకముగఁ బ్రేమించి సేవించిన యమ్మహాపురుషుని యడుగుజాడలలో నాత్మ ప్రత్యయభక్తి విశ్వాసములతో నడయాడు నెడల నెన్నఁడును త్యాగయుక్తము, సాహసోపేతమునగు నానిష్ఠుర కష్టమార్గమున నామె వెనుకంజవేయలేదు; అణుమాత్రమైనను జంకలేదు. మర్త్యత్వమువీడి యమర్త్యత్వము నంది భారతీయైతిహాసిక పౌరాణిక చారిత్రక కావ్య గానములందనియుఁదివ్య సువాసినీలోకమున సముచిత స్థానమునఁ జిరము వర్ధిల్లుచున్న యమ్మహనీయురాలినిగూర్చి సంతసింతుముగాత."

పండిత మదనమోహన మాలవ్యాయిట్లు తంతి యొసఁగెను:

"కస్తూరిబా మృతి యత్యంత సంతాపహేతువు. పతివ్రతలు హృదయపూర్వకముగ వాంఛించు సుమంగలీత్వ మామెకుఁ జెడని పదవియైనది. మహాత్మునికి వృద్ధాప్యమునఁ గలిగిన యివ్విచారమున విశ్వమంతయుఁ బాలు పంచుకొను చున్నది."

రాధాకృష్ణ పండితుఁ డిట్లుపన్యసించెను:

"భారతజాతీయ వీరపుంగవుల నామములెల్ల విస్మృతిగర్భమున విలీనములై తారాపథమున మినుకు మినుకుమను చుక్కలగములఁబోలి లెక్కింప రానివైనను గాంధీమహాత్ముని నామము మాత్రము నిష్కలంక క్షపాకరునిబోలి వెలుగొందును. కస్తూరిబా అట్టిమహనీయుని కన్నివిధములఁ దగిన యిల్లాలగుట అసాధారణ విషయము."

నిండుజాబిల్లిని పండు వెన్నెల యెడఁబాయని చందాన నిజభర్తృజీవితమునఁ బ్రత్యంతమునఁ బ్రత్యక్షమగుచుభక్తి బంధురహృదయముతో దేశసేవఁ గావించుచు గృతార్థమైన తిలకినీ తిలకము కస్తూరిమాత దివ్యచరిత్ర గరితలకెల్ల మార్గ

దర్శక మగుటయేగాక, పురుషులకు సైతము దేశసేవావ్రత దీక్షాపరాయణత్వ మొసఁగుఁగాక.

వ ం దే మా త ర మ్